# కృతజ్ఞతలు

ఈ నాటకానికి రూపం దిద్దిన
శ్రీరాములు బావకి
ప్రాణం పోసిన
నరసింహారావు తమ్ముడికి
పేరుప్రఖ్యాతుల్ని తెచ్చిన
విద్యానగర్ కల్చరల్ ఎసోసియేషన్ సభ్యులకి
రావ్‌జీ ప్రొడక్షన్స్ తమ్ముళ్ళకి

ఈ నాటకాన్ని ఏవిధంగా ప్రదర్శించ దలచుకున్నా- ముఖ్యంగా నాటక పోటీల్లో- రచయిత లిఖితానుమతిని పొందటం ముఖ్యం.


రచయిత చిరునామా :

ఎన్. ఆర్. నంది,

పూళ్ళ పోస్టు,

ఏలూరు తాలూకా,

పశ్చిమ గోదావరి జిల్లా,

"మరో మొహెంజొదారో" నాటకం ఒక ప్రయోజనాత్మక అత్యుత్తమ రచన" అని హేట్సాఫ్ అంది ఒక ప్రఖ్యాత పత్రిక పంధొమ్మిది వందల అరవై నాలుగులో.

"రచనల్లో ఏవీఁలేదు! వొట్టి నాన్సెన్స్" అన్నట్టుగా అధః పాతాళానికి అణగ దొక్కేసింది అదే పత్రిక పంధొమ్మిది వందల అరవై ఏడులో.

ఒక పరిషత్తులో జడ్జిగా వ్యవహరించిన ఒక ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు ఈ నా ట కా న్ని రెండు రంగాల కంటే ఎక్కువ చూడలేక పోయారు. సగం లోనించే లేచి పోయి మర్నాడు "ఇలాంటి నాటకాన్ని పరిషత్తులో ఎందుకు ఎన్నికచేశారని పరిషత్ నిర్వాహకుల్ని కోర్ట్ మార్షల్ చేశారు. బహుమతి ప్రదానం సమయంలో తతిమా యిద్దరు న్యాయ నిర్ణేతలు ఈ నాటకానికి ఉత్తమ రచన బహుమతి యివ్వాలని పట్టుబడితే, చచ్చినా ఇవ్వనని హఠంచేసి మెజారిటీ మాటను ధిక్కరించి తన పంతం నిలబెట్టుకున్నారు ప్రజా స్వామిక పద్ధతిమీద ఉపన్యాసాలిచ్చే ఈ నాయకమ్మన్యుడు.

మూడేళ్ళ తర్వాత ఇదే నాటకాన్ని చూసిన ఒక ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు స్టేజీ యెక్కి "ఇలాంటి అభ్యుదయ నిరోధక నాటకాన్ని పరిషత్తుల్లో వేయకూడదు." అని ఉప న్యసించారు. ప్రజా పరిపాలనే ధ్యేయంగా గల పార్టీలకూ,

ప్రజలకూ. విజ్ఞానాన్నందించాలనుకునే పత్రికలకూ వాటి నిర్వహణలో కొన్ని నియమాలూ, కనీస విధానాలూ వుంటవి. దాదాపు ఆ యా విధానాలకు అవి కట్టుబడి వుంటాయి, కాని ఈ నాటకాన్ని చూశాక పత్రికలూ, పార్టీలూ కూడా విరుద్ధమైన అభిప్రాయా లివ్వడానికి వెనుకంజ వేయలేదు. పంధొమ్మిదివందల అరవై నాలుగులో ఆ పత్రికలో హేట్సాఫ్ అన్న సమీక్షకుడూ, పంధొమ్మిది వందల అరవై ఏడులోకి కాపీ చేసిన విమర్శకుడూ ఆ పత్రికలో బాధ్యతగల హోదాల్లో పనిచేస్తున్న వాళ్ళే! అయినా ఈ నాటకం ఒకరికి అత్యుత్తమ మనిపిస్తే, మరొకరికి అధమాధమ మనిపించింది. ఈ భేదం రచనలో వుందా, లేక ఆ యా సమీక్షకుల దృష్టిలో వుందా?

సిద్ధాంతాల పరంగా చూస్తే పై రెండు పార్టీలూ ఉత్తర దక్షిణ ధృవాలంత ఎడంగా వుంటవి. కాని ఈ నాటకాన్ని తెగనాడదం దృష్ట్యా ఆలోచిస్తే ఈ నా ట కం లో ని ఏ అంశమో ఆ పార్టీ ప్రముఖులిద్దరికీ సమానంగా నచ్చకపోయి వుండాలి. అయితే ఆ ప్రముఖులిద్దరూ ఆ యా పార్టీ నిర్వాహకుల హోదాల్లో మాటాడి వుండక పోవచ్చు. వ్యక్తిగతమైన అభిప్రాయాలే అంటారేమో! కాని ఒక ధ్యేయంతో. పార్టీ సిద్ధాంతాలకు పూర్తిగా అంకితమై పోయిన వ్యక్తులు, దేని మీద అభిప్రాయాలిచ్చినా 'కాన్షస్' గానో, 'అన్కాన్షస్' గానో ఆయా పార్టీల దృక్పథాల్తోనే ఆలోచించి తదనుగుణమైన అభిప్రాయాలనే వెలువరుస్తూ వుంటారు. సంగీతాన్నే కానివ్వండి. సాహిత్యాన్నే కానివ్వండి. మరోటీ మరోటీ— ఏ స్వతంత్ర ప్రక్రియనన్నా వాటి విలువల్నీ, వాటి లక్ష్యాలనీ

ఆ దృష్టితోనే విమర్శిస్తారు. ఆ యా సిద్ధాంతాలతో కలుషిత మైపోయి, స్వతంత్రాలోచనలు వెనక్కి నెట్టబడి, వ్యక్తులు వ్యవస్థల కళ్ళతో అంత ఘోరాతి ఘోరమైన విమర్శలు చేస్తూవుంటే, నూతన కళా సృష్టి ఏమైనా ముమ్ముందు జరుగుతుందో లేక ఉత్సాహంతో, ఒక కొత్త పంథాలో స్వతంత్ర కళా సృష్టి చేయాలని ఉరకలువేసే కళాకారుడు, లేదా రచయిత దిగాలుపడిపోయి, నిరుత్సాహంతో ఆ కొత్త ప్రయత్నాలనించి విరమించుకొంటాడో సహృదయులు ఆలోచించాలి.

కొందరు వాస్కోడిగామాలు మరో కొత్త ప్రచారాన్ని మొదలు పెట్టారు. ఈ నాటకానికి హిందీలో, బెంగాలీలో మరాఠీలో ఒక మూలం వుందని ఘంటా పథంగా జుట్టు పీక్కున్నారు. రచ్చకెక్కిస్తామనీ, పత్రికలో రాస్తామనీ భీష్మప్రతిజ్ఞలు చేశారు. లేకపోతే తెలుగు వాడేమిటి యిలాంటి కొత్త పంథాలో రాయడమేమిటి అన్న అనుమానమేమో. ఇది ఏ యితర భాషలనించీ తస్కరించలేదు మహాప్రభో, కనీసం దీనికి మూలంలాంటి అక్షరమున్నా నేను ఏ భాషలోనూ చూడలేదు అని శోకాలు పెడితే, అయితే తప్పక వుండే వుండాలి అని గుండెలు బాదుకుంటారేమో! ఇప్పుడిది దాదాపు భారతీయ భాషలన్నిటిలోకీ తర్జుమా అవుతోంది. దీనిని ఢిల్లీ, బొంబాయి, మద్రాసు లాంటి యితర నగరాల్లో ప్రదర్శించినపుడు ఆయాప్రాంతపు ప్రముఖ రచయితలు దీనిని చూసి స్వయంగా ఉత్తరాలు రాశారు. తెలుగుదేశంలో యిప్పటికి దాదాపు పన్నెండు పరిషత్తుల్లో ఉత్తమ రచన బహుమతి గెల్చుకుంది.

"ఇటువంటి ప్రయోగాత్మ నాటకం నాకు తెలిసినంత వరకూ ఏ యితర భారతీయ భాషల్లోనూ లేదు" అని ఒక ప్రఖ్యాత విద్యావేత్త, నాటక నిర్వాహకులు అన్నారు.

"మేం సినిమాల్లో ఎన్నో ప్రయోగాలు చేస్తున్నాం. ఇంత సాహిత్యాన్ని సృష్టిస్తున్నాం. మమ్మల్ని మించినవాళ్ళు లేరని అనుకునేవాళ్ళం. కాని 'మరో మొహెంజొదారో' నాటకం చూశాక మేము వందేళ్ళు వెనకనున్నాం అనిపించింది." అన్నారు ప్రఖ్యాత తమిళ రచయిత దర్శక నిర్మాత అయిన శ్రీ శ్రీధర్‌గారు

"నేనునాలుగేళ్ళలో చెప్పలేనిదాన్ని రెండుగంటల్లో రచయిత నాటకంలో చెప్పగలిగారు." అన్నారు ఒక ఎకనమిక్స్ ప్రొఫెసర్.

"నాటకంలో వచ్చేపాత్రల్లోగల నీచబింబాన్ని నాతో పోల్చుకోనప్పుడు, ఆ యాపాత్రల్నిచూసి నేనెందుకు బాధపడాలి?" అని అన్నారు రచయితా, న్యాయవాదీ అయిన శ్రీ బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు.

ఒక పోలీసు అధికారిని అడిగాను : "నిజమే! నాటకంలో ప్రస్తుత సామాజిక జీవితాన్ని అతి నగ్నంగా చిత్రించారు. కాని రేపు ఒక 'పెద్దమనిషి' వచ్చి యిలాంటి నాటకానికి ప్రదర్శనానుమతి నెందుకిచ్చారంటే ఏ మని చెప్పడం ?" అన్నారాయన.

ఇంతటి దూషణ భూషణలకు గురైన ఈ రచనలో 'చెడు' అనేది ఏమిటి ? 'మంచి' అనేది ఎంతవుంది ? రచయితగా నాకు తెలీదు. నేను చెప్పలేనుకూడా! విమర్శకులు దీనిని

'వొత్తిచెత్త' అని విమర్శిస్తూ ఎన్నయితే కారణాలు ఎత్తి చూపగలరో, అత్యుత్తమ రచన అని పొగిడేవారూ అన్ని కారణాలూ చెప్పగలరు. ఎవరిఅభిప్రాయాలకు విలువనివ్వడం అయితే ?

ప్రతీ రచయితా ప్రపంచాన్నీ, సమాజాన్నీ, వ్యక్తుల్నీ ఏ విధంగా చూస్తాడో, ఏ విధంగా అర్థం చేసుకుంటాడో, ఏ సానుభూతితో పరిశీలిస్తాడో అదే విధంగా ఆ యా రచనల్ని తన వూహల్తో, అభిప్రాయాలతో, సానుభూతితో కల్పించి మలుస్తాడు. రచయితకు పేదవాళ్ళమీద విపరీతమైనజాలీ, సానుభూతీవుంటే, ధనవంతుల నందర్నీ దుర్మార్గులుగా, రాక్షసులుగా చిత్రిస్తాడు. డబ్బు వుండటం ఆ మనిషి పాపంకాదని భావిస్తే, ధనవంతులను అపరదైవ స్వరూపులుగా మలుస్తాడు ఏ వర్గానికీ, ఏ వ్యక్తికీ 'చెందకుండా' ప్రతీ కోణం నించీ ప్రతీవ్యక్తినీ, ప్రతీ సంఘటననీ చిత్రించడం ప్రస్తుత సమాజంలో రచయిత చేయలేని పనేమో! ఒకవేళ చేసినా అన్ని వర్గాల దూషణ భూషణలను ఎదుర్కోవలసి వస్తుంది.

నిజానికి ఈ నాటకంలోని కథా వస్తువులలో ఏమీ కొత్తదనం లేదు. ఒక ధనవంతుడు అతన్ని ఆశ్రయించుకుని బ్రతికే ఒక స్వార్థజీవి, అతని మిల్లులో పనిచేసే ఒక కార్మిక నాయకుడు ఇద్దరికీ యుద్ధం. ఆధునిక సమాజంలో వున్నవాళ్ళూ, లేనివాళ్ళూ ఎప్పుడూ వున్నారు. వాళ్ళమధ్య పోరాటం ఎప్పుడూ వున్నదే. ఆ పోరాటం రాకుండా చూడడానికీ, ఆ పోరాటానికి ఒక ప్రభుత్వం: పోరాటమేవస్తే ఆ తగువు తీర్చడానికి ఒకన్యాయస్థానంఎప్పుడూ వున్నవే ఆ ప్రభుత్వా

న్నిఎన్నుకునే ప్రజలూ వున్నారు. అయితే యిదంతా జరిగే విధానంలో ఏ యే లోపాలు వున్నవో, ఆ లోపాలకి కారణాలు, పరిస్థితులు ఎలాంటివో— ఒక్కొక్క వ్యక్తిని, ఒక్కొక్క వర్గానికి ప్రతినిధిగా ఎంచుకుని చిత్రించాను. ఇందులోని బిక్షాలు-కోటీశ్వరయ్య నౌకరు కాడు. సకల దరిద్రులకీ ప్రతినిధి.కోటీశ్వరయ్య ఒక వున్నవాడుకాడు. ధనిక వర్గానికి ప్రతినిధి. స్వార్థాలకూ, మోసాలకూ, పాపాలకూ, మానవ రూపం పరంధామయ్య. విప్లవశక్తికి ప్రతిరూపం భూషణ్. స్త్రీత్వానికీ, సృష్టికీ, సౌందర్యానికిపురుషుణ్ణి పేల్చి పారేసే డైనమైట్ తులసి పాత్ర, వీటిని మామూలుగా చూపించడానికి ఒక ప్రత్యేకమైన టెక్నిక్ కావలసి వచ్చింది. అదే ఈ నాటకానికి కొత్తదనాన్నిచ్చి ప్రాణం పోసింది. ప్రపంచంలోవున్న దేశాల నన్నిటినీ మూడురకాల వ్యవస్థలు పాలిస్తున్నాయి.రాచరికం, నియంతృత్వం, ప్రజాస్వామికం, ఈ మూడూకూడా సామాన్య మానవుడికి సుఖశాంతులను యివ్వాలనే దేశాలను పాలిస్తున్నాయి. సగటు మనిషికి కావలసిన కనీసపు టవుసరాలను కూడు, గూడు, గుడ్డయివ్వాలనేదే ఈ మూడింటి ముఖ్యోద్దేశమూను. కాని మామూలు మనిషికి యివి ఎంతవరకు అందుబాటులో వున్నవి? అవి అందుబాటులో వుంటే మనిషి ఏనాడో దేవతలా సుఖపడి వుండేవాడు. కాని సుఖపడటం లేదు. అంటే ఈవ్యవస్థల్లో ఎక్కడో ఒక లోపం వుండి వుండాలికదా? ఆ లోపం తిరిగి వ్యక్తిదే అవుతుంది. ఈ వ్యక్తులు కూడిన పార్టీలదే అవుతుంది. నాటక ప్రదర్శన జరిగిపోయిన చరిత్ర అయినా, జరగవలసిన వూహా అయినా రంగస్థలంమీద ప్రదర్శించేటప్పుడు వర్త

మానమే అవుతుంది. ప్రేక్షకులు 'దానిని' చూస్తున్నంత సేపూ అది 'ప్రస్తుతానికి' సంబంధించినదే. కాని ఈ నాటకంలో భూత భవిష్యత్కాలాలను ఒకేసారి వర్తమానంతో బాటు చూస్తారు. ఇది కొందర్ని తికమక పెట్టిందట! అంత లోతుకు పోకుండా మామూలుగా చూసే సగటు ప్రేక్షకుడు దీనిని మెచ్చుకోగలిగాడు. అలాక్కాకుండా దీన్లో ఏదో వుందని ఆలోచించిన వాళ్ళు ఏమీలేదని నిర్ణయానికిరాలేక, వుందంటే ఎలాంటిది వుంది అని అర్థం చెప్పలేక ఒక్క 'నాన్సెన్స్' అనే ముక్కతో కొట్టిపారేశారు. నాటకమే నాన్సెన్స్ అయివుంటే ఈ రచన ఏనాడో చచ్చిపోయి వుండేది (ఈ స్పుత్నిక్‌ల యుగంలో సాహిత్యంలో కూడా వేగాన్ని అందుకు గరిష్ట కాలపరిమితిని ఏడాదిగా మార్చేసుకుంది) ఈ ఏడాది కొలతతో దీనిని పరిశీలిస్తే అది యింకా సజీవంగానే వున్నట్టులెఖ్ఖ! ఇందులోని కథావస్తువు కంటే దానిని పరిశీలించిన తీరూ, ప్రదర్శించిన విధానం, ప్రేక్షకుల్ని బాగా ఆకర్షించి వుండాలి! ఈ నాటకాన్ని ఆ విధంగానే చూడండి కానీ, 'ప్రీ కన్సీవ్డ్ నోషన్స్' పెట్టుకుని చూడొద్దని ప్రార్థన. "మీమీ వ్యక్తిగతమైన స్వార్థాలతో, పార్టీల కక్షలతో సమాజాలని ఏక మొత్తంగాఎలా మొహెంజొదారో నాగరికతలు చేసిపారేస్తున్నారో చూడండి," అనేదే ఈ నాటకం ఉద్దేశం. (మొహెంజొదారో అనగానే క్రీస్తు పూర్వంవున్న మహోన్నత నాగరికతకాదు, ఆ మాట వినగానే మనకి అగుపించేది సింధులోయలోని శిథిల భవ

నాలూ, పతనమైపోయిన ఒక ప్రాచీన నా గ రి క తా ను. మొహెంజొదారోని నాశనం చేసింది ఆర్యులా లేక సింధు నది వరదలా అనేదికాదు ప్రస్తుతాంశం.)

* * *

ఈ నాటకాన్ని నాచేత 'రాయించినది' మా నరసు. ఇటీవల నవలగా ప్రచురింపబడిన 'నైమిశారణ్యం' కథను మొదట నాటకంగా రాసి మా నరసుకి (జె. ఎల్. నరసింహారావు) పంపించాను. అది అతనికి నచ్చలేదు. 'ఇంత చెత్త రాస్తావా? అని తిట్టాడు. నాకు కోపం రాలేదు. కసి వచ్చింది. అంతకు ముందు మూడేళ్ళుగా ఛాయామాత్రపు వూహగా మనసుని దొలిచేస్తున్న 'మొహెంజొదారో'ను కాగితం మీద పెట్టాలను కున్నాను. నాలుగుదినాల్లో నాటకం తయారై పోయింది. మా సి. శ్రీరాములు ముందుగా దాన్ని చదివి అత్యద్భుతం అన్నాడు, ఆ ప్రతిని తీసుకువచ్చి మళ్ళీ చదివి నాకే విని పించాడు. నాలుగు గంటల నాటకాన్ని మూడు గంటలకు కుదించి ఈ రూపానికి తీసుకువచ్చిన ఘనత శ్రీ రాములుదే. దానిని ప్రదర్శించి ప్రచారం చేసినవాళ్ళు మా విద్యానగర్ కల్చరల్ ఎసోషియేషన్ వారూ, జె. ఎల్. నరశింహారావూ ;

తర్వాత ఈనాటకాన్ని దాదాపు పదిపరిషత్తుల్లో ప్రదర్శించిన వారు రావ్‌జీ ప్రొడక్షన్స్ (విశాఖపట్నం) వారు. ఉత్తరాం ధ్రలో ఈ నాటకానికి ప్రచారాన్నిచ్చింది రావ్‌జీ. అంతే కాకుండా యిటీవల ఢిల్లీలో భారతీయ భాష లన్నిటిలోకి

ఉత్తమోత్తమ నాటకంగా (ద్వితీయ బహుమతిని) పొంద డానికి కూడా అతనే కారకుడు.

వీరందరికీ కూడా నా హృదయపూర్వక కృతజ్ఞతాభి నంద నలు అర్పిస్తూ 'మొహెంజొ దారో'ని మీ పరిశీలన నిమి త్తం మీ ముందుంచుతున్నాను.

— రచయిత

## 'రావ్‌జీ ప్రొడక్షన్స్' విశాఖపట్నం వారు వివిధ పరిషత్తుల్లో ప్రదర్శించినపుడు నటీనటులు

| | | |
|---|---|---|
| ప్రొఫెసర్ | — | ఆర్. రామచంద్రరావ్, రావ్‌జీ, కె. ఎమ్. ఎస్. శాస్త్రో, బి. వి, సుబ్బరాజు |
| బిళ్లు | — | సి. హెచ్. అప్పారావు |
| పరంధామయ్య | — | పి. జగన్నాధరావు |
| భూషణ్ | — | ఎస్. పఠాభిరామారావ్, జగన్నాధరాజు రావ్‌జీ. |
| కోటీశ్వరయ్య | — | జగన్. |
| లాయర్ | — | ఎస్. ఎమ్. శాస్త్రి. |
| డాక్టర్ | — | ఎ. సూర్యనారాయణ, అప్పలరాజు, రావ్‌జీ |
| తులసి | — | శ్యామల, కవిత, సూర్యకుమారి. |
| దర్శకత్వం | — | రావ్‌జీ. |
| సంగీతం | — | చిట్టి, బెనర్జి, ప్రకాశ్, భాస్కర్‌రావ్ సుబ్బారావ్. |
| లైటింగ్ | — | మూర్తి. |

# మరో
# మొహెంజొదారో

తెర వేసే వుంటుంది. తొలిగించుకుంటూ ఒక వ్యక్తి వస్తాడు. తల కొంత నెరసి వుంటుంది. ఎంతో కాలంగా ఏదో సమస్యతో నిరంతరం సంగ్రామంచేసి, చివరికి విజయం సాధించిన హాసం అతనిముఖంలో ప్రస్ఫుటిస్తుంది. చిందర వందరగా వున్న తల వెంట్రుకల్ని ఒకసారి వెనక్కి తోసుకుంటాడు, జేబులోనించి ఒక సిగరెట్ తీసి వెలిగిస్తాడు. ఒకసారి గాఢంగా దమ్ములాగి, పొగవదుల్తాడు. ప్రేక్షకుల్ని కలియ జూస్తాడు,

శాస్త్రజ్ఞుడు : నమస్కారం, చాలా కాలంగా మీరు వేచి యున్నారు. మీ సహనానికి, ఓపికకూ, జ్ఞాన తృష్ణకూ నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనలు.

"ఆధునిక మానవుని ప్రస్తుత పరిస్థితి" గురించి నాకంటే ముందు ఎందరో శాస్త్రజ్ఞులు, పురాతత్వ పరిశోధకులు, చరిత్రకారులు పరిశోధనలు చేశారు. నేను వారి వారి పరిశోధనల్ని పునః పునః పరిశీలించి నాకు తోచిన రీతిని ఈ మధ్య పరిశోధనలు చాలా కాలంగా జరిపాను. నా ప్రయోగాలకు ఒక సంపూర్ణ విజయం చేకూరిందని చెప్పలేను గాని, అవి చాలా వరకు ఒక కొలిక్కి రాగలిగాయి,

ఈ ఆధునిక మానవుడు చాలా చిత్రమైన ప్రాణి. తన కోసం, తన కుటుంబంకోసం, తనజాతికోసం, తనప్రాణుల కోసం నిర్విరామంగా ప్రకృతితో సంగ్రామం సల్పి తన మానవతకు ఒక కట్టుబాటునీ, నియమాన్నీ, సూత్రావళినీ నిర్ణయించుకుని ఒకసమాజాన్ని స్థాపించుకున్నాడు అక్కణ్ణుంచి వ్యష్టిగా, సమిష్టిగా తన జీవితం హాయిగా, ఆనందంగా సాగిపోతుందని అనుకున్నాడు. కాని ఆతనికి తెలిసి కొంతా, తెలియక కొంతా కొన్ని లక్షల కోట్ల తప్పులు తను నియమించుకున్న సామాజిక నియమాలని తెంపుకుని, వాటి కట్టుబాట్లలోనికి చొచ్చుకుని చిత్రాతి చిత్రమైన ఎగుడు దిగుళ్ళని నిత్య జీవితంలో కలిగించి పారేసినై.

ఈ కల్లోలాన్ని అరికట్టాలనుకున్నాడు. మానవునికి శాశ్వత శాంతి, సామరస్య జీవితం కలుగ జేయాలనుకున్నాడు. రకరకాల సిద్ధాంతాలు తిరిగి తిరిగి తయారు చేసుకున్నాడు. దాంతో అంతర్యుద్ధాలు, విప్లవాలు, సమరాలు చెలరేగాయి. చివరికి—ఏ తప్పుని దిద్దుకుని మానవ రాజ్యాన్ని స్థాపించాలని ప్రయత్నించాడో, మళ్ళీ మళ్ళీ అవే అవే తప్పుల్ని లక్షలు, కోట్లు చేసి, చేసి ఈ నాటి అసమతనూ, నీ, నా భేద భావాన్నీ కలిగించి మానవత్వాన్నే మంటగలపబోతున్నాడు.

ఈ అనిశ్చల స్థితిలో ఎటుపోవాలో అర్థంగాక తల వాల్చుకుని కూలబడి పోతున్నాడు.

ఇదే పరిస్థితి; ఇతిహాసం, లక్షల సంపుటాల్లో సంపాయించి పదిలం చేశారు. నేను వాటిని చూశాను. చదివాను. శోధించాను.

ఈ నా పరిశోధనలో మీరూ, మీరూ, మీరూ—అందరూవున్నారు, అందరూ పాత్రధారులే. తాజ్ మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీల స్వేద స్రవంతుల్నీ, అశ్రుబిందువుల్నీ నా టెస్ట్ ట్యూబుల్లో విశ్లేషణ చేశాను; ఆ రాణీ ప్రేమ పురాణాలో, ఈ ముట్టడికైన ఖర్చులో, ఖైఫీ

యతులో, జమాపద్దులో— ఏమైనా కానీండి, కుక్కపిల్లనూ, నబ్బు బిళ్ళనూ విడిచి పెట్టలేదు. పల్లకి నెక్కే ప్రభువుల్నీ, మోసిన బోయీలనూ పలకరించాను. పదుపుకూడు భుజించే స్వార్థజీవి గుండెల్లోకి 'ఎక్స్-రే' చేశాను. రోడ్డు ప్రక్క ఈగల్తో, దోమల్తో యుద్ధంచేసే కుష్ఠురోగి మృణ్మయ పాత్రల్ని శోధించాను. విప్లవకారుల ఉడుకు నెత్తుర్ని పరీక్షించాను. కస్తూరి పరిమళాల్లో, పన్నీటి జల్లుల్లో పవళించే ఉన్నవాళ్ళ ఉన్ని దుస్తుల్నీ మఖమల్ చెప్పుల్నీ అడిగాను.

నా విన్నవి కన్నవి విన్నవించబోగా మాటలకై వెనుకాడగబోతే పుంఖాను పుంఖంగా నాలో వెలువడింది — "మహో మొహెంజొదారో"

గత విషయాల సమీకరణ నా పరిశోధన. ఆ యా పరిశోధనలకిది క్రోడీకరణ భూతంలో జరిగిన తప్పుల్ని ఎత్తి చూపడం నా ధ్యేయం. మీకు తెలీదని కాదు. తెలుసు. కాని మరచిపోయారు. ఎన్నో నాగరికతలు పుట్టాయి. నాశనమవుతూ అవుతూ పుట్టాయి. పుడుతూ పుడుతూ నాశన మయ్యాయి. సత్సమాజం, సాంప్రదాయం "మొహెంజొదారో"లయ్యాయి. మళ్ళీ మళ్ళీ మొహెంజొదారోలు రిపీట్ అయ్యాయి. అవుతున్నాయి. అవుతాయికూడా! మనం యిప్పుడు మొహెంజొదారో అంచుల్లోనే ఉన్నాం. ఏ క్షణానైనా పడిపోతాం. పతనమైపోతాం. సర్వనాశనమైపోయే స్థితిలో పడిపోవచ్చు.

వద్దు, ఆ పరిస్థితి మనకి వద్దు, రానివ్వొద్దు లేవాలి. భయంలేదు. ధైర్యం, మనోదార్ఢ్యం కావాలి. ఈ సమాజంలో ఇవాళ కావలసింది విప్లవంకాదు: రక్తపాతం కాదు. సంస్కరణ। నైతిక సంస్కరణ నైతిక విప్లవం మనిషిలో రావాలి.

( శాస్త్రజ్ఞుడు వాచీ చూసుకున్నాడు )

వెల్ః కాలం ఎవరికోసం ఆగదు. వెళ్దాం రండి.

( తెర మెల్లగా ఏడింది. చీకటి )

శాస్త్రజ్ఞుడు వెనక్కి తిరిగి రంగస్థలం మీదికి వెళ్ళేసరికి రంగం మీద దీపాలు వెలిగాయి. రంగస్థలానికి కుడివేపుగ నాలుగుకుర్చీలు. నాలుగింటిమీద నలుగురు వ్యక్తులు. వాళ్ళ వెనుకమరో యిద్దరువ్యక్తులు ఏదో మాట్లాడుకుంటున్న భంగిమలో నిలబడి వుంటారు. ఈ ఆరుగురు వ్యక్తులు మనుషులు కారు. శవాలు అంతకంటే కాదు. శిల్పాలూకాదు. శాస్త్రజ్ఞుడు తయారు చేసుకున్న పుస్తకాలు. మనుష్యుల జీవితాలనించి ఆ గ్రంధాలు రచించబడ్డాయి. గాబట్టి ఆ 'పుస్తకాలు' తెరిస్తే మనం చదివేదే మన మనో నేత్రమందు అగుపిస్తుంది. అందువల్ల ఈ ఆరు "పుస్తక ప్రాణులు" నటిస్తున్నప్పుడు అంతా వూహాజనితంగానే వుంటుంది. ఉదాహరణకు : ఒక పుస్తకప్రాణి, సిగరెట్ కాలుస్తుందనుకోండి— అగ్గిపెట్టె వున్నట్టు జేబులోనించితీస్తారు. అగ్గిపుల్ల తీసివున్నట్టే వెలిగిస్తారు. నోట్లో 'వూహాజనితమైన' సిగరెట్‌నిపెట్టుకుని అగ్గిపుల్లతో వెలిగిస్తారు. నిజంగా వొస్తున్నట్టే వొదుల్తారు.

ఈ ఆరు "పుస్తక ప్రాణుల" మెళ్ళలో పెద్ద బోర్డులుంటాయి. ( ఈ బోర్డులు రెండవ రంగం నించి వుండవు. ) ఆ బోర్డులమీద వరసగా 4, 6, 7, 3 అనే అంకెలు—వెనక నిలబడిన వ్యక్తుల మెళ్లో 8 అనే అంకె— అంటే 'అవి' రెండు సంపుటాలు—వుంటాయి,

మెళ్ళో 4 అంకెగల 'మనిషి' పేరు భిక్షాలు, నౌకరు వేషం.

6 వ అంకెగల 'వ్యక్తి' పేరు భూషణ. సామాన్య వేషధారణ.

7 వ అంకెగల 'వ్యక్తి' పెరు పరంధామయ్య. ఉన్నదాంట్లో ఖరీదైన సామాన్య అలంకరణ,

3 అంకెగల 'మనిషి' కోటీశ్వరయ్య. శ్రీమంతుడు.




వెనక ఎనిమిదో నంబర్ గలవాళ్లు ఒకరు డాక్టర్, రెండోవారు లాయర్. డాక్టర్‌కి స్టెతస్కోప్ ఉంటుంది. లాయరుకి నల్ల కోటు.

రంగస్థలానికి రెండోవేపున పెద్ద ఎనిమిది అడుగుల బోర్డువుంది. అందుమీద పైన వున్న విధంగా వ్రాసి వుంటుంది:

తెర తెరిచిన తర్వాత శాస్త్రజ్ఞుడు ముందు బోర్డు దగ్గరకు వెడతాడు. ఈ బోర్డుని పరిశీలనగా చూసి తను తయారు చేసిన 'ఆరు గ్రంథాల' వేపు చూసి 'వాటి' దగ్గరకు వెడతాడు. ఒకసారి ఆ 'గ్రంధాలని' ప్రేమతో ఆప్యాయంగా చూసుకుని తిరిగి బోర్డు దగ్గరకు వస్తాడు. ఈ 'మూవ్ మెంట్' అంతా జరిగే లోపున దూరంగా ఎక్కడనించో ఒక శ్లోకం వినిపిస్తూ వుంది.

ఒక కంఠం : అథకేన ప్రయుక్తోయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥
కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణం.॥
—భగవద్గీత 3వ అధ్యాయం 46, 37 శ్లో॥

( శాస్త్రజ్ఞుడు పొడుగాటి కర్ర తీసుకుని గది నంతనీ చూపించాడు )

శాస్త్ర : ఇదే నా పరిశోధనా స్థలం. నేను తయారుచేసుకున్న గ్రంథాలయం. (కుర్చీల్లోని వాళ్ళని చూపిస్తూ) ఇన్నేళ్ళుగా నేను కష్టపడి సంపాయించిన గ్రంధాల క్రోడీకరణ సంపుటాలవి. (బోర్డుని చూపిస్తూ) ఈ పట్టీ నా పరిశోధనల ఫలితం. ఆధునిక మానవుని ప్రస్తుత సామాజిక జీవనం యిందులో యిమడ్చగలిగాను. చూడండి:

( కర్రతో ఒకటవ నంబర్ చూపిస్తూ )

మూల పురుషుడు : మానవుడు; పూర్వ మానవుడుకాదు. ఆధునిక మానవుడు ; పరిణామ క్రియలో పరిపూర్ణంగా పరణతి చెందిన, సాంఘిక నియమాలను కట్టుదిట్టంగా చేసుకున్న తర్వాతి మానవుడు.

ఆ నాగరికతా నియమాల్లో కాలక్రమేణా చీటలు కనిపిం చాయి. గోతులు ఏర్పడ్డాయి. రెండుగా చీలిపోయారు.

( రెండు, మూడు అంకెల్ని చూపిస్తారు )

ఒకడు : 'లేనివాడు'; రెండు: 'ఉన్నవాడు'. రాను రాను వీళ్ళ దరిమధ్యా పూడ్చలేని అగాధం ఏర్పడిపోయింది. అదొక సమస్య యింది, ప్రశ్నార్థకం అయింది.

( నాలుగు, అయిదు అంకెల్ని చూపిస్తారు )

ఈ లేనివాళ్ళు రెండు రకాలుగా వ్యవహరింప బడుతున్నారు. ఒకడు మరీ లేనివాడు', మరొకడు కొద్దిగా 'లేనివాడు.'

మరీ లేనివాడికి మరీ పెద్ద నిర్వచనమంటూ ఏంలేదు. మన చుట్టుపక్కలే వుంటారు. నిత్య జీవితంలో అనుక్షణం తారస పడుతూ వుంటారు. వాళ్ళని మనం దరిద్రులంటాం.

[ శాస్త్రజ్ఞుడు బోర్డ్ దగ్గరున్న స్విచ్ నొక్కాడు. ఒక లైటు వెలుతురు నాలుగు అంకెల 'పుస్తక ప్రాణి' మీద పడుతుంది. ఆ 'పుస్తకం' కదిలింది. అంటె భిక్షాలు అనే సంపుటం తెరవ బడింది. ]

శాస్త్ర : భిక్షాలూ!

భిక్ష : (ఉలిక్కి పడ్డాడు)

శాస్త్ర : భిక్షాలూ!

భిక్ష : బాబయ్యా!

శాస్త్ర : ఇలా రా.

భిక్ష : (లేచి వచ్చాడు) బాబయ్యా!

శాస్త్ర : ఎవరు నువ్వు?

భిక్ష : ఏంటి బాబూ ?

శాస్త్రు : ఎవరు నువ్వు ?

భిక్ష : ఎవురంటే ఏం సెప్పడం బాబయ్యా ? బిచ్చ మెత్తుకునే బిచ్చాలుని బాబయ్యా !

శాస్త్రు : ఏవూరు నీది ?

భిక్ష : అడుక్కునే వోడికి వో వూరేంటి బాబయ్యా ? లోకవంతా నా వూరే। ఇయ్యాల యిక్కడ బువ్వ దొరికితే యిదే నా ఊరు. నేకపోతే మరో వూరు।

శాస్త్రు : నువ్వు పుట్టడమే అడుక్కునేవాడిగా పుట్టావా ?

భిక్ష : నేదు బాబయ్యా నేదు ; మాఅయ్య కూలోడు. రోజూ రెక్కలు ముక్కలయ్యేటట్టు కష్టపడేవోడు. ఇంత తెచ్చి నలుగురికి పెట్టేవోడు.

శాస్త్రు : మరి నువ్వు అడుక్కునేవాడి వెలా అయ్యావ్?

భిక్ష : కర్మబాబూ కర్మ ; మా అయ్య తెచ్చే నాలుగురాళ్ళూ మా పది మందికీ సరిపొయ్యేవి కావు, కాని బతకాలి. ఎలాగ ? ఎలాగో లాగ బతకాలి గదా? బతకడానికి కోటి యిద్దెలున్నాయి.

శాస్త్రు : అందులో అడుక్కోవటం ఒక విద్య ;

భిక్ష : పెద్దోరు తమరట్టాగంటె ఏం సెప్పగల్ను బాబయ్యా। అడుక్కోవడ వంత నీసికం మరేం వుంది బాబయ్యా ? కుక్క బతుకు ; తిండి దొరక్కపోతే ఎంగిలాకులు నాకాలి. అష్టో యిద్దె అంటారా బాబయ్యా?

శాస్త్రు : అలాంటప్పుడు అడుక్కోవడ మెందుకు ?

భిక్ష : ఎవరి రా తెలా గుందో ఎవురు సెప్పగల్రు బాబయ్యా నా రాత కట్టా రాసి పెట్టుంది. సెయ్యక తప్పుతుందా?

శాస్త్రి : ఆ రాతెవరు రాశారు ?

భిక్ష : ( పైకి చూపిస్తూ ) బగమంతుడు బాబూ !

శాస్త్రి : అతన్ని నమ్ముతావా ?

భిక్ష : ఎంత మాటన్నారు బాబయ్యా? ఆ బగవంతుదే గనక నేకపోతే ఈ లోకంలో మనుషులు మనుసుల్లాగా బతగ్గల్రా?

శాస్త్రి : నీకేమైనా కుటుంబం వుందా బిక్షాలూ !

భిక్ష : ( దుః ఖం ముంచుకొచ్చింది. క్షణం నిశ్శబ్దం తర్వాత ) కుటంబం!....కుటంబం నేకేం బాబయ్యా! వుండేది ఒకప్పుడు.

శాస్త్రి : ఇప్పుడు ?

భిక్ష : అదిగో అ కాటిలో పడి కొట్టుకుంటూ ఆ అగ్గిలో అగ్గయిపోయి ఆ బుగ్గిలో నుసై పోయి, ఆ మట్టిలో మట్టయిపోయి, అదిగో ( ఆకాశంలోకి చూపిస్తూ ) ఆ అయ్యదగ్గరకు పోనాది........ కుటుంబం నేకేం బాబయ్యా: వుంది. ( పైకి చూపిస్తూనే ) అక్కడ ( ఏడ్చాడు. )

శాస్త్రి : భిక్షాలూ !

భిక్ష : అవును బాబయ్యా ! కుటంబం ఎవరికి నేదు ! అందరికీ వుంటాది. ఆ కోటీసరయ్య బాబుగోరికీ, పరందావయ్య బాబు గోరికీ, ఆ దాకటేరు బాబుగోరికీ, లాయరు బాబుగోరికీ అందరికీ వుంటాది. కాని ఆళ్ళ కుటుంబం, ఆళ్ళ సొంత రకత కుటంబం బాబు ! నాది అడుక్కునే కుటంబం. నా కుటంబాని కొచ్చే కస్టాలు కస్టాలు కావు. బాదలు బాదలు కావు. ఏడుపులు

ఏడుపులుకావు. అంతా తేదాయే. నా కళ్ళతో సూడండి బాబూ ! మీకూ కనిపిస్తాది నా కుటంబం.

శాస్త్రు : మీ తాతకూడా మీ తండ్రిలా కూలిపని చేసేవాడా ?

భిక్షా : నేదు బాబూ! మా తాత రైతట. కొంత భూంగూడా వుండేదట. మా ముత్తాత బాగా మోతుబరట. రాజు లాగా గుర్రాలమీద తిరిగే వోడట. మా అయ్య సెప్తుండేవోడు: నాను సూసెరగను బాబయ్యా ! నౌకర్లూ, సాకర్లూ పెద్ద దేవిడీ వొందల కొందలు ఎకరాలుండేవట. అదంతా చెడు సావాసాలు బట్టేసి నాసనం చేసేసినాడట .... ఇంతవేఁగాని ఆ వైభోగాలు నాను సూసెర గను బాబయ్యా. (నిట్టూర్పు) అళ్ళ నేతులు నాకారని సెప్పు కుంటే నాకేం వొరుగుద్ది – నేను అకులే కదా నాకుతున్నది?

శాస్త్రు : నువ్వు కోటీశ్వరయ్యగారి దగ్గర పని చేసే వాడివి కదూ?

భిక్షా : అవును బాబయ్యా ! అడుక్కునే వోణ్ణి తీసుకువచ్చి యింత దారి సూపించారు. మా రాజులు ధరమ పెబువులు.

శాస్త్రు : ఆయనన్నీకు చాలా అన్యాయం చేశారు కదూ ?

భిక్షా : అన్నాయం (బాధ ముందుకొచ్చింది) ఎక్కడనేదు బాబయ్యా అన్నాయం ? అన్నాయం ఏది కాదు ? సెప్పాను కదుబాబూ ; ఏ జలమంలోనో నేను జేసుకున్న పాపం ! అనుబగించాలి.

శాస్త్రు : అదికాదు భిక్షాలూ ! అతను నీ కూతురికి చాలా అన్యాయం చేశాడని....

భిక్షా : బాబూ! అన్నాయం అనకండి బాబు. అద్దానితల్రాత! అది ఏ జలమంలోనో పాపాలు సేసుకుంది, నా కడుపున పుట్టింది, చేసుకుంది గాబటి అనుబగించాలి. అనుబగించింది. ఎల్లిపోనాది.

అది అన్యాయమను కుంటే భగవంతుణ్నే తిట్టినోళ్ళ మవుతాం బాబయ్యా!

శా స్త్రు : (జాలిగా) భిక్షాలూ!

భిక్షా : బాబూ!

శా స్త్రు : నిజంగా దీన్ని నువ్వు మనస్పూర్తిగా అన్యాయం కాదనగలవా?

భిక్షా : (మాట్లాడడు. కన్నీళ్లు పెట్టుకుంటాడు.)

శా స్త్రు : నీ కుటుంబమంటే నీకు ప్రేమన్నావ్. అదే కుటుంబం నీకళ్లెదురుగానే సర్వనాశనం అవుతూ వుంటే చూస్తూవున్నావు!

భిక్షా : బాబూ!

శా స్త్రు : నీ కుటుంబం కళ కళ్లాడుతూ నాలుగు కాల్లాలపాటు నిలబడాలని నీకు మాత్రం వుండదూ? నీ కూతురికో మంచి సంబంధంచేసి, ఆమె సుఖపడితే చూసి సంతోషించాలని నీకు మాత్రం లేదా భిక్షాలూ?

భిక్షా : ఎందుకుండదు బాబూ!

శా స్త్రు : మరీ ఆత్మవంచన దేనికి?

భిక్షా : తమరి మాటలు నాకర్థం గావటంలెదు బాబు!

శా స్త్రు : అవును! అందుకే నువ్వు గొంగళి బ్రతుకు బ్రతుకుతున్నావ్? సరె! ఇక నువ్వు వెళ్లు.

[భిక్షాలు నమస్కారంచేసి, కళ్లు తుడుచుకుని వెళ్ళి కుర్చీలో కూచుంటాడు. కూర్చున్నాక శాస్త్రుడు భిక్షాలుమీద దీపం ఆర్పేశాడు. భిక్షాలు : శిలా ప్రతిమ అయ్యాడు.]

శా స్త్రు : ఇదీ దరిద్రుల జీవిత సంగ్రహం! వీడిని మనం దరిద్రుడంటాం. అడుక్కునే వాడంటాం. నౌకరంటాం— ఏమని

పిలచినా అతనుకూడా మనమానవ సంఘంలో ఒకభాగమే. ఆధునిక నాగరికతలో యెక్కడో ఒకచోట జరుగుతున్న లోపానికి ఫలితంగా ఉద్భవిస్తున్న జాతివాడు.

అతని ముత్తాత మోతుబరి, తాత రైతు, తండ్రి కూలివాడు, అతను ముష్టివాడు. ఎందుకిలా తరం తర్వాత తరం దిగజారిపోతోంది? ఏమిటీ విలోమ సిద్ధాంతం? ఎక్కడుంది లోపం?

తాత ముత్తాతలు తాగి తందనాలాడి ఆస్తిని కాళ్ళావేళ్ళా జల్లిపారేశారు. అది వాళ్ళ స్వార్జితం. కాబట్టి ఆ ఆస్థిమీద వాళ్ళకు హక్కుంది అంటారు. కాని ఈనాటి ఈ భిక్షాలు, ఈ నికృష్ట స్థితికి దిగజారిపోవడానికి ఈ తాత ముత్తాతలు కాదా కారణం? ఇన్ని కోట్ల భిక్షాళ్లు ఈ సమాజంలో ఈనాడు ఇలా దినదినం ఉద్భవించకుండా వుండాలంటే మనం— ఈ 'తాగుబోతుల పూర్వీకుల్ని' వాళ్ళ మనస్తత్వాలనీ మార్చొచ్చుగా? అందుకు కొన్ని నియమాలు తయారుచెయ్యాలి. ఇంతకు ముందు అలాంటి నియమాలులేవా? ఉన్నాయ్. కాని వాటిని త్రికరణ సుద్ధిగా ఆచరింపజేసే సమాజం గానీ, ఆచరణకు వ్యతిరేకులయిన వాళ్లను శిక్షించే తాహతుగానీ మనిషికి లేకపోయింది.

భిక్షాలు బుద్ధీ మనస్సూ పొగచూరిపోయాయి. తను ప్రాణాధికంగా ప్రేమించే తన కుటుంబం యావత్తూ ఒక అహంకారి ఆగ్రహానికీ, ద్వేషానికీ గురై సర్వనాశనమైపోయినా దానిని అన్యాయం అనటంలేదు. పూర్వజన్మ సుకృత మంటున్నారు. ఏజన్మలోనో చేసుకున్న పాపానికి ప్రాయశ్చిత్తం జరుగుతోంది అనుకుంటున్నాడు. ఇలాంటి పాపపుణ్యాల కృతకవాదాన్ని లేవనెత్తి దేవుడనే దివ్యమానవాతీత శక్తిని సృష్టించి,

బిఖాలు లాంటి కోట్ల మనుషుల్ని నికృష్టపు జీవితంలో శాశ్వ తంగా మగ్గిపోయేట్టు చేస్తున్నాడు మానవుడు,

ఈ లేనివాళ్ళ జాతికి సంబంధించి మరో జాతి వుద్భవిం చింది, ( బోర్డులో 5 వ నంబరు చూపిస్తూ ) వీళ్ళని సామాన్య కుటుంబీకులంటారు.

ఇదో చిత్రమైన జాతి. విచిత్రాలన్నీ ఈ జాతిలో నించే పుడతాయి. ప్రపంచజనాభాలో వీళ్ళే హెచ్చు. వీళ్ళు ఏడుస్తారు, నవ్వుతుంటారు. బాధపడతారు, కాని బాధపడట్టూ, ఏడుస్తున్నట్టూ పైకి తెలీనివ్వరు, సిగ్గు. ఆ నాలుగుగోడలమధ్యా ఏడ్చేసి బయట కొచ్చి నవ్వుమొహం పెడతారు. గౌరవం, మర్యాద అంటే వీళ్ళకి ప్రాణం. నిజానికి ప్రాణం కాదది; నటన. పైకి ఏడవ లేకా, లోపల యిముడ్చుకోలేకా త్రిశంకు నరకంలో బ్రతుకు తారు. అలా ఎన్ని బాధలుపడ్డా బయట పడనివాళ్లు కొందరు, అసలు ఆ బాధలు తమకెందుకు రావాలని అరచేవాళ్ళు కొందరు అన్ని బాధలూ సహించే వాళ్ల లో కొందరు మరీ స్వార్థపరులు. వాళ్ళు తమస్వజాతి అయిన సామాన్య కుటుంబంనించి విడిపోయి ఏదో వుపాయంతో, ఏదో మోసంతో నిచ్చెనలు వేసుకుని ( నెంబర్ 7 దగ్గర నిచ్చెనను చూపిస్తూ ) ఉన్న వాడి పంచెను చేరి తనూ వున్నవాడిగా అయిపోవాలని ప్రయత్నం. అలాంటివాడే పరంధామయ్య. ( 7వ నెంబరుచూపిస్తూ) స్వార్థపరుడు, వీళ్ళం దర్నీ అరచి దండోరావేసి విమర్శించేవాడు ( 6వ నంబర్ చూపిస్తూ) భూషణ్. విప్లవకారుడు.... ముందుగా స్వారజీవిని పలకరిద్దాం,

[ శాస్త్రజ్ఞుడు స్విచ్ వేశాడు. వెలుతురు 6, 7 నంబర్లుగల

'పుష్పక ప్రాణులమీద పడుతుంది. శాస్త్రజ్ఞుడు 'పరంధామయ్యగారూ' అని పిలవడంలో 7వ సంవత్సరగం 'ప్రాణి' కదిలిరది. ఉలిక్కిపడింది.]

శాస్త్ర : పరంధామయ్యగారూ!

పరం : ( లేచివచ్చాడు, అయ్యా పిలిచారా ?

శాస్త్ర : ఆఁ!

పరం : ( ప్రొఫెసర్ని కిందా మీదా చూసి ) కాకితో కబురంపితే రెక్కలు కట్టుకుని తమ పాదాలవద్ద వాలే వాణ్ణి కదటండీ - తమరు స్వయంగా నా దగ్గరకొచ్చి 'పరంధామయ్యగారూ' అని పిలవాలటండీ ?

శాస్త్ర : నేనెవరో మీకు తెలుసా ?

పరం : తెలియాలటండీ ! తమలాంటిపెద్దలు మేధావులు, శ్రీమంతులు రాజకీవితో అలా నిలబడితేచాలు తమ రాజసం ఖంతల కూ్డా తెలిసిపోతుందే !

శాస్త్ర : నేను రాజునీకాదు, శ్రీమంతుణ్నీ కాదు.

పరం : అమ్మమ్మ ! ఎంత మాటెంతమాట ! గొప్పవాళ్ళ వాక్కులే వేరు, అలానే శెలవిస్తూ వుంటారు. ఏమీ లేని వాళ్ళం మేమే మిడిమిడి జ్ఞానాన్ని ప్రదర్శించు కుంటూంటాం. అయ్యో తమరలా నిలబడే పోయారు. రండి ! లోపలికి వెడదాం! మా ఆతిథ్యాన్ని స్వీకరించి ఏదో మా లాంటి అల్పుల్ని పావనం చెయ్యాలి. (కేకేస్తాడు) ఒసేవ్ ! ఒసేవ్ ! జానకీ ! జానకీ ! అతిథులొచ్చేరే ! శ్రీమంతులయిన అతిథులు....

శాస్త్ర : అవిదెవరంధి ?

పరం : నా లక్ష్మి. సాక్షాత్తు నా సహధర్మచారిణి. అగ్నిసాక్షిగా పెళ్లాడిన అ ర్ధాం గి.

శాస్త్రి : ఆఁ!

పరం : అంటే నా అర్ధాంగే కానండి, ఆమెను చూస్తే మీరే అంటారు! పరంధామయ్యో! నువ్వు చాలా అదృష్టవంతుడివోయ్! రంభ లాంటి భార్య దొరకడం నీ పూర్వజన్మ సుకృతమయ్యా!, అని, అలానే మా కోటీశ్వరయ్యగారు కూడా అంటూ వుంటారు.... అయ్యో! తమ రిం కా నిలబడే వున్నారు; ఓసేవ్ జానకీ! జానకీ!

శా : అనవసరంగా మీరామెగారిని పిలవకండి. నా మ న స్త త్వం మీ ఆతిధ్యాన్ని మెచ్చుకునే మనస్తత్వం కాదు.

పరం : మా జానకిని చూస్తే తమరామాట అనరు. అనలేరు. ఓసేవ్! జానకీ! ఇంకా రావేమే?

శా : పరంధామయ్యగారూ! మీ రామెగారిని పిలిస్తే నేనికడ్నుంచి వెళ్ళిపోవాల్సి వస్తుంది.

పరం : అమ్మమ్మ! ఎంతమాటెంతమాట! పోనీ అలానే కానిద్దాం, పెద్దలు తమకిష్టంకాని పని చెయ్యను. చెయ్యలేను. కాని మన సంభాషణల మధ్య ఆవిడకూడా వుంటే .... సర్లెండి. తమ మనస్సు నొప్పించడం నా కిష్టంలేదు.

శా : మీ భార్యంటే మీకంత గౌరవమా?

పరం : అమ్మమ్మ! ఎంత మాటనేశారు! గౌరవమేకాదు, పూజ్య భావం కూడాను.

శా : పూజ్యభావమా?

పరం : నా అభిప్రాయం తమరు సరిగ్గా అర్థం చేసుకున్నట్టులేదు. స్త్రీ అంటే—ఆ మాటకొస్తే ఏ స్త్రీ అన్నా—నాకు పూజ్యభావమే! మన పురాణాల్లోనూ, కావ్యాల్లోనూ, చెప్పలేదటండీ! స్త్రీ ఆదిశక్తి అని। సరిగ్గా అదే భావం నాది.

సా : అందరు స్త్రీలన్నా మీ కదే భావమా ?

పరం ; తప్పకుండా!

శా ; తులసి అన్నా!

పంర : తులసెవరు ?

శా : భిక్షాలు కూతురు.

పరం : ( ముఖంలో అసహ్యం కనిపిస్తుంది ) చూశారూ, మన పురాణాల్లో స్త్రీకి ఒక నిర్వచనమంటూయిచ్చారు. సమయానికి శ్లోకం జ్ఞప్తికి వచ్చి చావటంలేదు. భావం చెప్తున్నాను। ఉత్తమోత్తమ గుణాలు ఏ స్త్రీలో అయితే ఉంటాయో ఆమెయే పూజనీయురాలగు స్త్రీ అని టూకీగా.

శా ; తులసిలో ఉత్తమ గుణాలులేవా ?

పరం : ఎలా వుంటాయి చెప్పండి ? తండ్రి అడుక్కుతినే రకం. తల్లికి కులంలేదు. ఆ పిల్లకు—ఏమో సరిగ్గా చెప్పలేనుగాని—డబ్బు కక్కుర్తి మాత్రం వుంది. ఎంతయినా చిన్న కులాల్నుంచి వొచ్చిన మనుషులు కదటండీ—

శా : చిన్నకులంలో నించివచ్చినంత మాత్రాన ఉత్తమ గుణాలు లేవంటారా ?

పరం : అమ్మమ్మ। నా అభిప్రాయాన్ని తమరు సరిగ్గా అవగాహన చేసుకున్నట్టులేదు! చిన్నకులాల నించి పైకొచ్చి మహాత్ము

లయిన వాళ్ళెందరో మన పురాణాల్లో వున్నారు. కాని ఆ కాలం వేరు.

శా : ఏవిటా వేరు ?

పరం : నిజం చెప్పాలంటే .... ఏవండీ, తమ నామధేయం తెలీదు—

శా : సత్య శివసుందరం.

పరం : సత్య శివసుందరంగారూ ! (పేరులోని అర్థం ఛప్పున జ్ఞప్తికి వచ్చినట్టుంది.) సత్య! శివ! సుందరం! ఆహా! హా! ఎంత చక్కని పేరు! ఆధ్యాత్మిక ప్రపంచాన్నంతనీ ఈ మూడు నామాల్లో యిమడ్చవచ్చు. తమ తల్లిదండ్రులెవరో నిజంగా మహాజ్ఞానులై వుండొచ్చు. మహత్తరనామం తమకు పెట్టారు !

శా ; మేం హరిజనులం.

పరం ; హరిజనులా! హాస్యమాడుతున్నారు.

శా ; నిజం.

పరం ; నిజమా!.... అయితే మాత్రం, ఆ వర్చస్సు, ఆ ఠీవి, ఆ మాటలతీరు ....

శా ; నే నడిగిందానికి మీరింకా సమాధానమివ్వలేదు.

పరం ; అమ్మమ్మ! వస్తున్నా, వస్తున్నా, అక్కడికే వస్తున్నా. ఎక్కడొదిలేశానూ నా సంభాషణని ?

శా ; చిన్నకులాల్లో వుత్తమగుణాలు ....

పరం ; ఆఁ ఆఁ! చిన్నకులాల వాళ్ళల్లో వుత్తమగుణాలు కదూ! వున్నాయి! లేకేం చాలా వున్నాయి. ఉదాహరణకు. తమర్నే తీసుకోండి....

శా : నే నడిగింది భిక్షాలు కుమార్తె తులసి గురించి.

పరం : అవునవును తులసి! పేరు చాలా బావుంది. మంచి గుణాలే వుండొచ్చు.

శా : మీకు తెలీదా ?

పరం : నాకేం తెలుస్తుంది. చెప్పండి ? పరస్త్రీ, మాతృభావనచేసి.

శా : మీరామెతో మాటాడలేదా ?

పరం : అనుకోండి.

శా : ఏవిటనుకోవడం ?

పరం : అటూ ఇటూ కూడానూ! అయినా సత్య శివసుందరంగారూ....

శా : ఆ పేరెట్టి పిలవకండి.

పరం : చిత్తం, చిత్తం అలానే!

శా : యెందుకని అడగరేం ?

పరం : పెద్దవారు. తమరేభావంతో అలా అనొద్దని అనుంటారో? అలా నిలేసి 'ఎందుకు? ఏం?' అని ప్రశ్నించడం నామతంకాదు.

శా : మీరెవర్నీ ప్రశ్నించరా!

పరం : కొన్ని సమయాల్లో,

శా : ఏవిటా సమయాలు ?

పరం : సరిగ్గా యివని చెప్పలేను కానీ....

శా : ఆకలివేస్తే అరుస్తారా ?

పరం : నాకెందుకు ఆకలివేస్తుంది? వేస్తే మాత్రం అరవాలా?

శా : వస్తువులున్నప్పుడు!

పరం : వస్తులా? వస్తులు నేనెందు కుండాలి?

శా : మీకు డబ్బులు లేనప్పుడు.

పరం : డబ్బు నాదగ్గరెందుకులేదు?

శా : ఎక్కడిది? మీతాత ముత్తాతలు గడించి విడిచి పెట్టారా?

పరం : వాళ్ళు విడిచి పెడితేనేగాని డబ్బు వుండదంటారా?

శా : మీరు గడించారా?

పరం : అవును,

శా : ఎలా?

పరం : ( నుదురు వేలుతోరాస్తూ ) ఇది ఓడ్చి ।

శా : చమటా?

పరం : ఆ(!

శా : మీ వంటో ఎన్నికోట్ల గాలన్ల చమట వుందేమిటి?

పరం : అంటే ?

శా : మీరెంత చెమటోడ్చి కష్టపడ్డా మీరు యిన్నిలక్షల రూపాయలు సంపాయించి వుండలేరు, మీ జీవితం చాలా చిన్నది, ఇరుకుది. ఆ అల్పకాలంలో యింతడబ్బు ఎలా గడించుకోగలిగారు?

పరం : (బెదిరి) మీరు పోలీసువాళ్ళా?

శా : కాదు.

పరం : ఇన్‌కమ్ టాక్స్‌వాళ్ళా?

శా : కాదు.

పరం : అయితే మీకెందుకా విషయం?

శా : సమాజంలో ఎన్నో చిన్న చిన్న రంధ్రాలు పడిపోయాయి. అవి కనుక్కోడానికి వచ్చిన శాస్త్రజ్ఞుణ్ని.

పరం ; నా దగ్గర కెందుకొచ్చారు!

శా ; మీరొక రంధ్రం కాబట్టి.

పరం : ఇదిగో బాబూ! మీరేదో మహామేధావులూ, గొప్పవాళ్ళూ అనుకుని ఇంత సేపూ మీతో మాట్లాడుకుంటూ కూచున్నాను. నా కాలం వృధా చెయ్యకండి.

శా : ఆగండి. ఇక్కడ నా పని పూర్తయాక గానీ మీరిక్కణ్నుంచి వెళ్ళడానికి వీల్లేదు.

పరం ; ఏం పని అది?

శా : సమాజానికి పడిన చిల్లుల్ని కప్పేసెయ్యాలి.

పరం ; (నవ్వాడు) మహా మేధావి వనుకున్నాను. పిచ్చివాడివా నువ్వు?

శా : పరంధామయ్యా!

పరం ; లేకపోతే ఏమిటయ్యా! సమాజమంటే ఏమిటనుకున్నావ్! మహా సముద్రం. దీంట్లో కోటికోట్ల అలలు లేస్తాయి. అవి ఎందుకు లేస్తున్నాయి. ఆపలేమా అని ప్రశ్నించేవాడు పిచ్చివాడుకాక మేధావా?

శా ; బుద్ధులు చెప్తున్నారా నాకు?

పరం : చెప్పొద్దూ మరి. ప్రపంచాన్ని చూసినపెద్దవాడిని. లోకం పోకడని కనిపెట్టిన మనిషిని. చూడునాయనా, సమాజాన్ని ప్రశ్నించేంత పిచ్చిపని చెయ్యకేం! ఆ అలల్లో నువ్వూ కొట్టుకుపోతావ్.

శా : ప్రయత్నిస్తాను.

పరం : ఎదురీతా! ... వద్దుబాబూ! అనుభవంమీద చెప్తున్నాను నేను సర్వనాశనం అయిపోయాను. చాలా మందిని ఆ సుడి గుండం లోకి తిప్పేశాను. నాకు వొరిగిందేమిటి? క్షణికమయిన ఆనందం, క్షుద్రమయిన సంపద! నేనేం సుఖపడ్డాను? నేను సుఖపళ్ళేదు సరికదా సమాజాన్ని ఏక మొత్తంగా సుఖపడనివ్వలేను. నాలాంటివాళ్ళు సమాజంలో ఎందరున్నారో తెలుసా? వాళ్ళందర్నీ బాగుచేసి, సమాజం బూజుదులిపి, సంస్కరించి, ఉద్ధరించడం నీ ఒక్కడికీ చేతకాదు బాబూ!

[ఇందాక శాస్త్రజ్ఞుడు లైటు వేసినప్పుడు ఆ కాంతి 6, 7 అంకెలమీద పడింది. ఇద్దరికీ ప్రాణం వచ్చింది. కాని ముందు శాస్త్రజ్ఞుడు పరంధామయ్యనే పిలిచాడు గాబట్టి భూషణ్ కుర్చీమీద ఆవులించికదిలినా, లేవలేదు. పరంధామయ్యమాటలన్నీ వింటూ వున్నాడు. పరంధామయ్య చివరి మాటలతో భూషణ్ పక పక నవ్వాడు. ]

పరం : (నవ్వు ఎవరిదో తెలీదు) ఎందుకా వెకిలి నవ్వు?

శా : మీలో వచ్చినమార్పు అర్థంగాక మీస్వజాతి ఆశ్చర్యపోతుంది,
[భూషణ్ మెల్లగా లేచివచ్చి వింగుని ఆనుకుని నిలబడ్డాడు.]

పరం : నేనేం మారలేదు. ఎప్పుడూ ఒకే లాగున వున్నాను.

శా : ఆత్మవంచన చేసుకుంటున్నారు.

పరం ; లేదు! లేదు! (ఆగిపోయాడు) అవును! అవును! (నవ్వాడు) ఆత్మవంచన (పిచ్చిగా నవ్వాడు) పరవంచన, ఆత్మ పరవంచనలు! పరాత్మ వంచనలు (ఏడ్చాడు) అవును. వంచనలే చేశాను.

శా : పరంధామయ్యగారూ!

పరం : మీ కాళ్లు పట్టుకుంటాను, నన్ను విడిచిపెట్టండి బాబుగారు।

శా : సరే మీరు వెళ్ళండి.

[పరంధామయ్య బరువుగా వెళ్ళి కుర్చీలో కూలబడ్డాడు. శాస్త్రజ్ఞుడు సాలోచనగా ఎటో చూస్తూ మెల్లగా వెనక్కి తిరిగి పక్క కుర్చీ వేపు చూశాడు. శాస్త్రజ్ఞుడు కంగారుపడతాడు. చుట్టూ చూశాడు]

శా : భూషణ్। భూషణ్।

భూ : [వెనకనించి వచ్చాడు] మీ వెనకనే వున్నాను.

శా : నేను నిన్ను పిలవకండా....

భూ : ముందుచూపుకి అలవాటు పడిపోయాను ప్రొఫెసరుగారూ।

శా : కాని యిక్కడ కొన్నినియమాలువున్నై. క్రమశిక్షణ అవసరం.

భూ : క్షమించండి। ఆపుకోలేక పోయాను. ఆ బాధ అలా అనిపిస్తుంది, ఈ పతితుల్నీ, భ్రష్టుల్నీ, బాధాస్పరదష్టుల్నీ చూసిచూసి చేసేది లేక, అభ్యుదయం, అభ్యున్నతి అని అరచి ప్రచారంచేసి చేసి నేనలవరచుకున్నది ఆ ముందు చూపేనండి.

శా : భూషణ్। ఈ నీ ముందుచూపు ఏ నాటికైనా ప్రపంచానికి దారి చూపించగల దంటావా?

భూ : తప్పకుండా ప్రొఫెసరు, తప్పకుండా. మా కుటుంబాల మీదా, మా అస్థిపంజరాల మీదా, మా రక్తం కలిపి, సిమెంట్‌చేసి ఆకాశాలనంటే భవంతులు కట్టేవాళ్ళమేడలు నాకు మెలుకువ వచ్చి ఆవలించి వొళ్ళుదులిపితే అవి కూలక ఏమవుతాయి ప్రొఫెసరు.

శా : ఈ నీ కోపమంతా ఎవరిమీద భూషణ్?

భూ : కోపమేమిటి ప్రొఫెసరు; సర్వం తెలిసినవారుమీరు. నా న్యాయమైన కోర్కెల్ని హక్కుల్ని ఎలుగెత్తి అడిగితే మీరే కోపమంటారా. అది కోపంకాదు ప్రొఫెసరు: బాధ! నాలో పలికే సర్వుల బాధనీ ప్రకటించి మానవతకు ఒకఉత్కృష్ట స్థానాన్ని కట్టిద్దామని.

శా : ఈ నీ ఉద్యమం ఎప్పటికి గెలుస్తుంది?

భూ : ఏమో! ఎన్ని అడ్డుగోడల్ని దాటాలి. ఎన్ని శక్తుల్ని జయించాలి ప్రొఫెసరు! ఈ మహాయజ్ఞంలో ఎందరు రాలిపోతారో మరి! అయితే ఈవిజయసాధనకు భూషణ్ భౌతికంగా బ్రతికుండాల్సిన అవసరంలేదు. ఆ శక్తి మిగతావాళ్ళల్లో వుందింకా! ఈ సంగ్రామం సాగుతూనే వుంటుంది.

శా : నీ ధ్యేయం సిద్ధించాక!

భూ : మానవ రాజ్యం స్థాపించబడుతుంది. అక్కడ ఈ దారుణ కృత్యాలూ, కిరాతకులూ యెవరూ వుండరు. సర్వులూ సమానం ఆకలీ, దాహం, దారిద్ర్యం వుండవు. మనిషి మనిషిగా బ్రతకగలిగే వాతావరణం వెల్లివిరుస్తుంది. అంతంటే మనిషి కోరుకునే స్వర్గం ఏముంటుంది ప్రొఫెసరు?

శా : ఆ–నీ స్వర్గసామ్రాజ్యానికి కోటీశ్వరయ్యను రానిస్తావా?

భూ : [తీవ్రంగా] ఉహుఁ!

శా : ఏం?

భూ : అతనికా అర్హతలేదు.

శా : ఎందుకులేదు?

భూ : అతను క్షమింపరాని తప్పులుచేశాడు.

శా : తప్పు మానవస్వభావంగా?

భూ : తెలియకచేసిన తప్పుకి క్షమార్హత వుండొచ్చు.

శా : కోటీశ్వరయ్య తెలిసే చేశాడంటావా?

భూ : ఆఁ!

శా : కాని అతను చాలామందిని పోషించాడు. మిల్లులుకట్టాడు. కూలీలను పిలిచాడు. వాళ్ళకింత బ్రతుకు తెరువు చూపించాడు.

భూ : అవును అదంతా ఎందుకు చేశాడు? స్వార్థం!

శా : పదిమందిని పోషించడం స్వార్థమంటావా?

భూ : పదిమంది కష్టఫలితం తనొక్కడే అనుభవించడం.

శా ; పెట్టుబడి అతను పెట్టాడు.

భూ ; ఆ డబ్బు అతనిదికాదు.

శా ; మరెవరిది?

భూ : ప్రజలందరిదీను.

శా : అదెలా అవుతుంది?

భూ : ఎలా అవుతుంది కాదు; అవాలి!

శా ; విప్లవం లేవదీస్తావా?

భూ ; తప్పనప్పుడు.

శా ; విప్లవంలో రక్తపాతం జరుగుతుంటే!

భూ : అయినాసరే– ఈ సాంఘిక దుష్టుల్ని కూకటివేళ్ళతో సయితం పెకలించి వేయాలంటే రక్తపాతం జరగాలి. ఒకటి ఆలోచించండి ప్రొఫెసరు! మనుషులందరూ సమాన మనుకున్నప్పుడు

ఒకడి దగ్గరకోట్లు మిగతావాళ్ళ దగ్గర కుండలు వుండటానికి వీల్లేదు. ఈవాళ కోట్లున్న వాడిచేతిలోనే అధికారముంది: తుపాకీలున్నాయ్, అణుబాంబులున్నాయ్. వాడు ఒక్కడు. ఎందుకు వాడికంతడబ్బు? కోట్ల జనం అన్నమో రామచంద్రా అనిఅల్లాడి పోతున్నారే! రాలిపోతున్నారే! కూలిపోతున్నారే! నీ మానవ సహజమైన జాలి, దయ సానుభూతి ఏమయ్యాయి? అవిజ్ఞప్తికి తెప్పించాలని ప్రయత్నించాం. ఇక లాభంలేదు వాడి తుపాకీలూ అణుశక్తి మమ్మల్ని అడ్డగించలేవు. జగన్నాధ రథం కదిలింది ప్రొఫెసర్.

శా : నువ్వు సహనాన్ని కోలుపోతున్నావ్?

భూ : మీరు నన్నలా ఉద్రేకపరుస్తున్నారు; తప్పు చేసినా కోటీశ్వరయ్యను క్షమించమంటున్నారు.

శా : క్షమించడం వరకూ వద్దు. కనీసం కృతజ్ఞతా భావమన్నాలేదు నీకు.

భూ : దేనికి కృతజ్ఞత?

శా కోటీశ్వరయ్య నీకు పిలిచి వుద్యోగ మిచ్చారు.

భూ : అదే, ఎందుకిచ్చారు? నా ఏడుపు చూసిగానీ, నా ఆకలి బాధకు జాలిపడిగానీ, నా రక్తంలేని ఎండిపోయిన దేహాన్ని చూసిగానీ నాకా ఉద్యోగం యివ్వలేదు. నా వూపిరిలేని కంఠంలో నిర్విరామంగా మ్రోగే మేల్కొలుపు గీతానికి భయపడి, నా పాద ఘట్టనకు భీతిచెంది, నా నిజాయితీకి జడిసి, నన్ను చేరదీసి దువ్వబోయాడు. అలా నా ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయబోయాడాయన.

శా : అది నిజమా?

భూ : ఆయనా యిక్కడే వున్నారుగా అడగండి.

[ శాస్త్రజ్ఞుడు స్విచ్ వేశాడు. 3వ నెం. ప్రాణిమీద పడుతుంది. శాస్త్రజ్ఞుడు— 'కోటీశ్వరయ్యగారూ' అని పిలచేసరికి ఆ ప్రాణి కదిలింది ]

శా : కోటీశ్వరయ్యగారూ!

కోటీ : [లేవకుండానే] ఎవరూ?

శా : నేను: ప్రొఫెసర్ సత్యశివసుందరాన్ని.

కోటీ : ఊఁ. ఏం కావాలి?

శా : మీతో కాస్త పనుంది.

కోటీ : చందాలా?

శా : కాదు. ఒకసారి యిలా వస్తారా?

[కోటీశ్వరయ్య ఆశ్చర్యంగా చూస్తాడు: తనని యిలా ఎవరో ఆజ్ఞాపిస్తున్నందుకు]

శా : రావాలి?

కోటీ : ఆజ్ఞా?

శా : ప్రస్తుతం ఆజ్ఞే! మీరిప్పుడు నాపరిశోధనా గృహంలో ఉన్నారు. నా ఆజ్ఞను మీరు మన్నించాలి.

కోటీ : నే నెవరో్న తెలుసుకునే మాట్లాడుతున్నారా?

శా : ఆఁ!

కోటీ : అయినా ఆజ్ఞాపిస్తున్నారా?

శా : అవును.

కోటీ : పర్యవసానం ఆలోచించారా?

శా : [నవ్వుకుంటాడు] మాటకుముందు మీకంతకోపం తగదు.

భూ : అదే, అదే– ఆ ధనమదంతో సంక్రమించిన జబ్బు!

కోటీ : నోర్ముయ్!

[కోటీశ్వరయ్య ఛర్రున లేచాడు. ప్రొఫెసర్ అడ్డాడు]

భూ : చూశారా? భౌతికంగా చచ్చిపోయినా మనిషిలో అహం మాత్రం చావలేదు!

కోటీ : మీరంతా స్మశానంలో చేరి నామీద కుట్రలు పన్నుతున్నారా?

శా : ఇది స్మశానంకాదు; ప్రపంచం.

కోటీ : ఇదో ప్రపంచం– మీరొక మనుషులు [విరగబడి నవ్వాడు]

భూ : ప్రొఫెసర్!

శా : నవ్వనియ్.

కోటీ : నేను నవ్వడానిక్కూడా నీ ఆజ్ఞ కావాలా? నేన్నవ్వను.

భూ : అయితే ఏడవండి.

కోటీ : నోర్ముయ్!

భూ : ఇది మీ ప్రపంచంకాదు. మీ యిష్టమొచ్చినట్లల్లా ప్రవర్తించ డానికి.

కోటీ : అలాగా... ఒరే భిక్షాలూ! పరంధామయ్యా!

భూ : పిలవండి! యింకా పిలవండి.

కోటీ : ఒరే రాములూ! గంగులూ! ఎల్లయ్యా!

శా : ఎవరూ లేరు కోటీశ్వరయ్యగారూ!

కోటీ : ఒరే పరాంకుశం, పరమేశం– ఎక్కడ చచ్చార్రా మీరంతా!

శా : నిజంగానే లేరు కోటీశ్వరయ్యగారూ!

కోటీ : ఆఁ!

శా : నిజమే! ఎవరూ లేరు. ఉన్నా కనిపించరు కనిపించినా మీమాట వినిపించదు.

కోటీ : ఆఁ! [భయంగా కుర్చీలో కూలబడ్డాడు]

శా : లేవండి (గట్టిగా) లేవండి!

కోటీ : (లేస్తూ) తంతారా!

భూ : (పక పక పక నవ్వాడు)

కోటీ : ఎవరుమీరు?

శా : సత్యాన్ని, శివాన్ని, సుందరాన్ని.

కోటీ : అవేవిఁటో నాకు తెలీదు ఇక్కడికెందుకు తీసుకొచ్చారు?

భూ : చచ్చారు గనుక.

కోటీ : నేను చచ్చిపోయానా? అయ్యో! నా బ్రతుకేం కావాలి?

శా : దిగులు పడకండి: నేనున్నాను.

కోటీ : ఎందుకు? నన్నింకా చిత్రవధ చెయ్యడానికా? నేను మీకేం అపకారంచేశాను బాబూ! ఏం ద్రోహం చేశాను? నా జీవితంలో నే నే ప్రాణికీ హాని తల పెట్టలేదే!

భూ : ఆహాఁ!

కోటీ : నిజం బాబుగారూ! చీమలకు నూకలు వేసేవాడిని. పక్షులకు పళ్లు పెట్టేవాడిని.

భూ : మనుషులకు విషం పెట్టేవారు. చూశారా ప్రొఫెసర్! డబ్బుని, మనిషినీ వేరుచేసేస్తే ఎలామారిపోయారో కోటీశ్వరయ్యగారు?

శా : అలాంటి మనిషిని చిత్రవధ చేస్తానంటున్నావ్ నువ్వు (కోటీశ్వరయ్యతో) అయితే మీరెప్పుడూ ఏ ప్రాణికీ ఎలాంటి అపకారం చెయ్యలేదా ?

కోటీ : లేదు బాబూ!

భూ : అబద్ధం! మిల్లుకట్టించి లక్షమంది పొట్టల్ని కొట్టాడు.

కోటీ : కిట్టనివాళ్ళు లక్షమాటలంటారు. మీరు పెద్ద మనిషిలా అగుపిస్తున్నారు. మీకు నిజానిజాలు తెలీకపోవు.

శా : అంత అమాయకంగా మాట్లాడకండి. అతను చెప్పినదాంట్లో నిజం లేకపోలేదు.

కోటీ : ఏవిఁటా నిజం? నా దగ్గర డబ్బు వుండటం అన్యాయమా? నేను ధనవంతుణ్ణి కావడమే నేనుచేసిన నేరమా? నేనుమిల్లులు కట్టించీ, ఫ్యాక్టరీలు నడిపీ, పంటలు పండించీ పదిమంది కింత అన్నం పెట్టడం తప్పా? ఎవిఁటి నేనుచేసిన ఘోరఅన్యాయం? ఎందుకు నన్నిలా నిలదీసి అడగటం ?

భూ : వాటన్నిటి వెనకా మీస్వార్థం వుండటంఘోరం. అహం పొంచి వుండటం పాపం, అధికారం చెలాయించడం అన్యాయం.

శా : వాటి మాటలా వుంచి, మీరు మనిషి కుండాల్సిన కనీస ధర్మాలను కోల్పోయారు. మీ ఫ్యాక్టరీగురించీ మీ భూముల గురించీ మాట్లాడటం లేదు. ఖైలు కూతురు తులసి విషయం.

[భూషణ్ తులసి మాటవిని ఉగ్రుడవుతాడు]

శా : సహనాన్ని కోల్పోకూడదు భూషణ్!

భూ : నా తులసికి అతను చేసిన అన్యాయం—

కోటీ : తులసికి నేనేం అన్యాయం చెయ్యలేదు. తనమటుకు తానే గోతిలో పడింది.

భూ : తన మటుకి తానే పడిందా?

శా : ఆమె శీలాన్ని మీరు నాశనం చెయ్యలేదా?

కోటీ : లేదు.

భూ : లేదూ?

కోటీ : నువ్వెందుకంత వుద్రేకపడతావ్? ఆమెకూ నీకూ ఏవిఁటి సంబంధం?

భూ : ఆమె నా భార్య.

కోటీ : భార్యా! ఆహాఁ! పెళ్ళెప్పుడయిందో?

భూ తాళికడితేనేగాని పెళ్ళికానట్టా?

కోటీ : విన్నారా ప్రొఫెసర్!

భూ : నేనామెను ప్రేమించాను

కోటీ : నేనుకూడా.

భూ : నీకు ప్రేమ కూడానా?

కోటీ : ఏం— ప్రేమించేహక్కు నీ వొక్కడికే వుందా?

శా : ష్! వాదాలు నా కనవసరం.

కోటీ : అనవసర మేవిఁటి ప్రొఫెసర్! మీరింతవరకూ అంటున్నారుగా! సమాజంలోకొన్నినీతినియమాలు అవసరమని! వివాహం విషయంలో ఆ నియమాలు పాటించనవసరంలేదా అతను?

భూ : పాటించాను.

కోటీ : ఎలా? తాళికట్టలేదు, భార్య అంటున్నావ్। పెళ్ళిఅనేది ఎప్పుడు యెలా జరిగినట్టు? అక్రమ సంబంధమా, అయినప్పుడు సామాజిక నియమాలను అతిక్రమించినట్టుకాదా?

భూ : నువ్వుచేసింది రాక్షసకృత్యం.

కోటీ : నువ్వు చేసింది?

శా : భూషణ్, కోటీశ్వరయ్యగారూ। మీరూరుకుంటారా లేదా।

భూ : ఆయన వితండవాదం వింటున్నారా మరి?

కోటీ : వితండవాదం నాదికాదు నీది. నియమం అనేది అందరికీ ఒకటే.

శా : సరే బాబూ। మీరిక మీ మీ స్థానాలకు వెళ్ళిపోండి

(కోటీశ్వరయ్య ప్రొఫెసర్ వేపు కోపంగా చూసి కుర్చీలో కూలబడ్డాడు. భూషణ్ చేసేదిలేక నోటమాటరాక తనూవెళ్ళి కుర్చీలో కూచుంటాడు శాస్త్రజ్ఞుడు వాళ్ళమీద లైట్ ఆర్పేశాడు)

శా : ఇదీ పరిస్థితి। ఆధునిక మానవుడు ఆ యీ భేదాలు పెంచుకుని తన మానవత్వాన్నే మరచిపోయి ఎలా యుద్ధాలకు దిగుతున్నాడో మీరందరూ చూశారు. ఈ యుద్ధం కేవలం ఒకే సమస్యనించి జనించలేదు ఆర్థికం, మానసికం, నైతికం. ఉన్నవాడికి డబ్బు వుందని గర్వం, చిన్నచూపు, కోపం. లేనివాడికి అతని డబ్బునీ, గర్వాన్నీ చూసి కోపం, పగ, అసూయ ఇందులో ఎవరిది తప్పో, ఎవరివల్ల సమాజానికి ఎంత అపకారం జరుగుతుందో నిర్ణయించడం కష్టం. (బోర్డు దగ్గరకు వెళ్లాడు. 8వ నెంబరు చూపిస్తూ) ఇతను ఉన్నవాడు. ఇప్పుడొచ్చిన పేచీ అంతా యితనికీ (6వ నెంబరు చూపిస్తూ) యితనికీ।

ఈ పేచీ పర్యవసానం ఎలావుంటుందోగాని ప్రస్తుతం మాత్రం మరో మొహెంజొదారో తయారవుతోంది.

(శాస్త్రజ్ఞుడు 8వ నెంబరుని చూపిస్తాడు)

శా : ఇక మరోరకం జాతి. వీళ్ళు ఉన్నవాళ్ళనించీ వస్తారు లేని వాళ్ళనించీ వస్తారు. వీళ్ళని మేధావులు అనొచ్చు మహామేధావులుగాకూడా వ్యవహరించవచ్చు. వీళ్ళల్లో అతిమంచి వాళ్ళూ ఉన్నారు, అతి ధూర్తులూ వున్నారు. తాము చాలా గొప్పవాళ్ళ మనే గర్వంతో తమ ప్రపంచంలో తాముండేవాళ్ళూ వున్నారు. 'ప్రపంచమంతా వొట్టి మూర్ఖులదీ' అనే అసహ్యంతో బ్రతికే వాళ్ళూ ఉన్నారు. ఎవరి గొప్పతనమూ వీళ్ళు గుర్తించరు. వీళ్ళ గొప్పతవాన్ని ప్రపంచం గుర్తించదని గోలపెడతారు. వీళ్ళు ఉన్నవాళ్ళనించి వచ్చినా లేని వాళ్ళనించి వచ్చినా వీళ్ళు ఉన్నవాడి పక్షమే. వీళ్ళదో ప్రత్యేకమైనజాతి. నైజం, తత్వం. వీళ్ళ గురించి వేరే విడిగా ఏం చెప్పనవసరంలేదు.

(శాస్త్రజ్ఞుడు 'ఇక మరో రకంజాతి' అని మొదలుపెట్టినపుడు 8వ నెంబరు ప్రాణుల్లో చైతన్యంవచ్చింది. వాళ్ళుఅక్కడే ఆప్యాయంగా కరచాలన చేసుకుని ఏవో మాట్లాడుకుంటూ ముందుకి వస్తారు. ఏం మాట్లాడుకుంటున్నారో ప్రేక్షకులకు వినిపించదు. పెదవులకదలిక. శాస్త్రజ్ఞుడు తమగురించే మాట్లాడుతున్నాడని గ్రహించి అతని మాటల్ని శ్రద్ధగా వింటూవుంటారు. కాని శాస్త్రజ్ఞుడు తమని విమర్శిస్తున్నాడని తెలీగానే కోపంగా అక్కడినుంచి బయట కెక్కడికో పోతారు)

శా సంగ్రహంగా యిదీ ఆధునిక మానవుని ప్రస్తుత పరిస్థితి. దానికి నేనిచ్చిన రూపానికి అవసరమైన పునాదులన్నీ ఈ కోటీ

శ్వరయ్య, ఈ పరంధామయ్యలు, ఈ భూషణ్‌లూ, ఈభిక్షాలూ, ఈ మేధావుల జీవితాలనించి తవ్వితీసినవే! వారి వారి జీవితాలూ, ప్రవర్తనలూ, తత్వాలూ విడివిడిగానూ, కలసి కట్టుగానూ పరిశీలించినపుడే నా సిద్ధాంతం మీకర్థమవుతుంది.

(శాస్త్రజ్ఞుడు ప్రేక్షకులకు అభివాదనచేసి రంగస్థలం మీద దీపాలన్నీ వెలిగించి బయటకు వెళ్ళిపోతాడు. దీపాలన్నీ వెలగటంతో, నిర్జీవ ప్రతిమల్లా వున్న నలుగురులోనూ చైతన్యం వచ్చింది. భూషణ్ లేచి స్టేజీకి ఒకమూలగా వెడతాడు. కోటీశ్వరయ్య కుర్చీలో ఠీవీగా కూచుని మీసాలు దువ్వుకుంటాడు. భిక్షాలు లేచిపోయి పైగుడ్డతో కుర్చీలు తుడుస్తాడు. పరంధామయ్య లేచిపోయి కోటీశ్వరయ్య పక్కకుచేరి 'కాళ్లుపట్టమంటారా?' అన్నట్టు పెదవుల కదలిక కోటీశ్వరయ్య వద్దనిచేత్తో వారిస్తాడు. పరంధామయ్య భిక్షాలుని 'నువ్వెళ్ళవోయ్' అనిపెదవులు కదిలించి బయటకి పంపిస్తాడు. ఇందాక నిష్క్రమించిన డాక్టర్, లాయర్ 'దండాలు మహాప్రభో' అన్నట్టు చేతులు జోడించి గబ గబ ప్రవేశిస్తారు. కోటీశ్వరయ్య జేబులోనించి Imaginary చుట్టతీస్తాడు. పరంధామయ్య Imaginary అగ్గిపెట్టె వెలిగించి అతని నోటిముందుపెట్టాడు. తమకంటె అతను కోటీశ్వరయ్య దగ్గర చేరువయి పోతున్నాడని డాక్టర్, పరంధామయ్య వెలిగించిన ఊహాజనితమైన అగ్గిపుల్లను నోటితో వూది ఆర్పేశాడు. తర్వాత ఇమేజినరీ సిగార్ లైటర్ వెలిగిస్తాడు. దానిని లాయరు నోటితోవూది ఆర్పేస్తాడు. కోటీశ్వరయ్య తన జేబులోనించి అగ్గిపెట్టెతీసి వెలిగించుకుని Imaginary చుట్టను వెలిగించు కుంటాడు. ఇంతలోపిచ్చి దానిలా నవ్వుకుంటూ తులసి రయ్‌నవస్తుంది. భూషణ్ చప్పున ఆమెదగ్గరకొస్తాడు. రెండో వేపున

కోటీశ్వరయ్య, డాక్టర్, లాయరు, వాళ్ళవెనుక పరంధామయ్యనిల బడ్డారు. భూషణ్ క్రోధంగా కోటీశ్వరయ్యమీదికిరాబోతాడు. కోటీశ్వరయ్య Imaginary చుట్టను పారేశాడు.భూషణ్‌ని తులసిఅడ్డగించింది. కోటీశ్వరయ్య పక పక నవ్వాడు. శబ్దం వినిపించదు. భిక్షాలు వచ్చాడు. తులసిని విడిపించుకుంటున్న భూషణ్‌కి రెండోవేపుకి చేరాడు. ఇటువేపున డాక్టరు, లాయరు, కోటీశ్వరయ్య విరగబడి నవ్వుతున్నారు. భూషణ్ తులసిని తోసేసి ముందుకి వచ్చాడు. కోటీశ్వరయ్య నవ్వు ఆపేశాడు. భూషణ్ మరో అడుగు ముందుకి వేశాడు. కోటీశ్వరయ్య Imaginary పిస్టల్ తీశాడు. భూషణ్ యింకా ముందుకి వచ్చి కోటీశ్వరయ్య మీద కలియ బడ్డాడు. కోటీశ్వరయ్య చేతుల్లోని పిస్టల్ పేలింది. భూషణ్ నేలకొరిగాడు. తులసి భయంగా అతనిమీదపడి భోరుమంది. భిక్షాలు ఎటూ చెప్పలేక తచ్చాడాడు. పరంధామయ్య శిలలా నిలబడిపోయాడు. కోటీశ్వరయ్య, డాక్టరు, లాయరు వేపు చూశారు. ఇద్దరూ అతని వేపు భయంగా చూశారు. కోటీశ్వరయ్య వాళ్ళ బుజాలు తట్టి నవ్వాడు. వాళ్ళిద్దరూ అప్పుడు నవ్వారు. ముగ్గురూ విరగబడి నవ్వారు. ముగ్గురూ నిష్క్రమించారు. వాళ్ళు నిష్క్రమించాక పరంధామయ్య తేరుకున్నాడు. వాతావరణాన్ని చూశాడు. పిచ్చిగానవ్వాడు. అంతపిచ్చి గానూ అరచుకుంటూ పారిపోయాడు. )

పరం : కోటీశ్వరయ్యగారూ ! జిందాబాద్ ! కోటీశ్వరయ్యగారూ జిందాబాద్ !

(అది నవ్వో, ఏడుపో, వ్యంగమో అర్థంగాదు. అతను అరుస్తూ పోతూవుంటాడు)

:— తెర :—

# రెండవ దృశ్యం

(తెర మెల్లగా విడుతూ వుంటుంది. శాస్త్రజ్ఞుడు చప్పున వస్తాడు)

అప్పుడేవద్దు మూసెయ్యండి. కొన్ని విషయాలు చెప్పాలి. [తెర మూసుకుంది] క్షమించాలి. మీ ఉత్సాహానికి గాలం వేశాను ఒక్కక్షణం, ముందు రెండుముక్కలు చెప్పాక రెండవ దృశ్యాన్ని చూద్దురుగాని.... మొదటి దృశ్యంలో నా పరిశోధనల క్రోడీకరణ చెప్పాను. విశదీకరించాను. మానవుడి నాగరికత ఏయే కారణాలవల్ల నాశనం అయిపోతున్నదీ చెప్పాను. ఒక వేళ ఈ పరిస్థితులు యిలానే సాగినట్టయితే మనం, మన ప్రస్తుత నాగరికత ముమ్ముందు ఎంతటి పతనం పొందుతుందో చూపిస్తాను. గత చరిత్రను తరచి చూశాక, ఇకముందూ ఇలానే సామాజిక జీవితం నాశన మయిపోతే— మనం గతం నించి ఏ పాఠాన్నీ నేర్చుకోలేక పోతున్నామన్నమాట:....

(తెర విడింది, రంగస్థలం ఖాళీ. నల్లని తెరలు వెనకా, పక్కలా. మధ్యలో మాత్రం నాలుగు కుర్చీలు)

శా : ఇది ప్రపంచం. మనది. మీదీ, నాదీ, అందరిదీను. కోటీశ్వరయ్యభవంతి కావచ్చు. లాయర్ వాదించేన్యాయస్థానంకావచ్చు. పరంధామయ్య నడమంత్రపుసిరితో కట్టించుకున్న మేడకావచ్చు భూషణ్ కలలుగనే స్వర్గసామ్రాజ్యం కావచ్చు. దృశ్యాన్ని చూసి వాతావరణాన్ని వూహించుకోవడమే మీరు చేయాల్సిన పని. ప్రస్తుతం ఇది కోటీశ్వరయ్య భవంతి. మీ ఎదురుగా వెనక కనిపించే ద్వారం (ద్వారం అక్కడ ఏమీలేదు. కేవలం నటీ నటులు రాకపోకలు సాగించేందుకు కాస్త తెరపక్కకి తొలగించి వుంటుంది) కోటీశ్వరయ్య పడకగదిలోకిదారి. ఎడం వేపు ద్వారం సింహద్వారం. కుడివేపు ద్వారం గృహాంతర్భాగం [వెనుకనున్న నల్లని తెరని చూపిస్తూ] ఈ ఫొటో కోటీశ్వరయ్య ధర్మపత్ని గారిది. ఆవిడ ప్రస్తుతంలేరు. పోయారు.

(శాస్త్రజ్ఞుడు పైమాటల్లో 'ప్రస్తుతం యిది కోటీశ్వరయ్యగారి భవంతి. అన్నపుడు భిక్షాలు గృహాంతర్భాగంలో నించి వచ్చి Imaginary తువాలుతో కుర్చీలు తుడుస్తూ వుంటాడు. గోడల పటాలు తుడుస్తాడు. 'ఈఫొటో కోటీశ్వరయ్య ధర్మపత్నిగారిది అన్నప్పుడు భిక్షాలు Imaginaryఫొటోకి నమస్కారంచేసి కళ్ళు కద్దుకుంటాడు. ఇంతలో బయటనుంచి. తులసి Imaginary పూలు పట్టుకుని వస్తుంది. తంత్రీ నాతుళ్ళు ముఖాలు చూసుకుంటారు. అక్కడవున్న Imaginary రౌండ్ టేబిల్ మీదవున్న Imaginary ఫ్లవర్‌వేజ్‌లో ఆ పూలుపెట్టి గృహాంతర్భాగం లోనికి వెడుతుంది శాస్త్రజ్ఞుడు నిష్క్రమించాడు. పరంధామయ్య వచ్చాడు. బయటనించే కేకవేసుకుంటూ వచ్చాడు)

పరం : బాబుగారూ ! బాబుగారూ !.... ఓహో! నువ్వటోయ్ భిక్షాలూ!

ప్రపంచంలో ఎవరికీ తెల్లారకపోయినా ముందు మీకు తెల్లారిపోతుంది.... ఆఁ! బాబుగారు లేచారా?

భిక్షా : లేచారండి, ఒక్క_సిటం. అలా కూకోండి. (గృహాంతర్భాగంలోకి వెళ్ళాడు. పరంధామయ్య కూచోబోతూవుండగా పడక గదిలోనించి కోటీశ్వరయ్య వస్తాడు. కూచోబోతున్న పరంధామయ్య ఛప్పునలేచిపోతాడు)

పరం : సుప్రభాతం. బాబుగారికి! సుప్రభాతం!

(కోటీశ్వరయ్య సమాధానంగా తల మాత్రం వూపుతాడు)

పరం : తెల్ల వారకుండానే వచ్చేశాను. ఏవిఁటో వెధవది: నా మనస్సు వెన్నలాంటిది తమర్ని చూసిన వేళావిశేషమేమిటోగాని, ఒక్క_క్షణం_ ఒకే ఒక్క క్షణం.... తమర్ని చూడలేకపోతే వుండలేనండి. ఏవిఁటో అనుబంధం!

కోటీ : పూర్వజన్మానుబంధమేమో!

పరం : నిజం నిజం! ఈ అనుబంధాలూ, ప్రేమలూ, యిష్టాలూ మనం కోరుకుంటే వచ్చిపడేవటండీ! తమరు శలవిచ్చినట్టు పూర్వజన్మానుబంధం వుండాలి మరి. ఏమో! పూర్వజన్మలో మనిద్దరి మధ్యా పెద్ద అనుబంధమే వుండివుండొచ్చు. కాని ఆ అనుబంధమేమిటో సరిగ్గా తెలీటంలేదు.

కోటీ : (నవ్వుతూ) భార్యా భర్తలమేమో?

పరం ; సరిగ్గా నా మనస్సులోని భావమే శలవిచ్చారు. రాత్రికూడా నాకు కల అలానే వచ్చింది.

కోటీ : చచ్చాం ఫో!

పరం : హాస్యంకాదు బాబుగారూ! నిజం. నేను భర్తగానూ తమరు

భార్యగానూ ( కోటీశ్వరయ్య కోపంగా చూడటంతో మాట మార్చి ) ఆహాఁ, తమరు భర్తగానూ, నేను....

కోటీ : సరే! ఆ కలలన్నీ తీరుబడిగా చెప్పొచ్చులే ....విశేషాలేమిటి?

పరం : విశేషాలు ప్రత్యేకంగా యేమీలేవనుకోండి..కాని ఆస్వప్నమే...

[ ఈ సోది వినలేక కోటీశ్వరయ్య జేబులోనించి Imaginary చుట్టతీసి వెలిగిస్తాడు. పరంధామయ్య మాట్లాడుతూనే తన జేబులోని Imaginary అగ్గిపెట్టెతీసి వెలిగిస్తాడు. అది కోటీశ్వరయ్య Imaginary చుట్టకి పెడతాడు )

పరం : ఈ కలంతావచ్చింది వచ్చినట్టు మా ఆవిడకు చెప్పాను. చెప్తే ఏమందో తెలుసాండీ? ఫకాలుననవ్వింది. నవ్వి, అయితేనన్నే గోదాట్లో దిగమంటారూ తర్వాత? అంది. అంటే నేనన్నానూ! 'అదేవిటే! రంభలాంటి సౌందర్యరాశివి! నీకేం కొదవే, గోదాట్లో పడి దాన్ని అర్థాంతంగా నాశనం చేసుకోవడమేవిఁటి? అని.

కోటీ : పరంధామయ్యా! మిల్లువిషయాలు చెప్పావ్ కాదు!

పరం ; చిత్తం చిత్తం! చివరికి అక్కడికే వస్తాను. నా కీ స్త్రీ పురుష సంబంధాలు గురించి అంతగా తెలీదండి. తెలిసినా అంతధ్యాస వుండదు. ఉన్నా పట్టించుకోను. సమాజంలో యిన్ని అలజడులకు కారణం; ఆడదాన్ని గిరిగీసి, అందులో వుండమని శాసించడమే. నేను కాస్త పూర్వపు వాసనకొట్టే మనిషిలా అగుపించినా నాభావాలు అత్యాధునికాలు.

( కోటీశ్వరయ్య విసుగెత్తి భార్య 'ఫొటో' దగ్గరకు పోతాడు. పరంధామయ్య అతని వెనకనే పడ్డాడు)

పరం ; తమధర్మపత్ని! పాపం! మహాలక్ష్మిలాంటివారు! మంచివాళ్ళకే ముందు మృత్యువు ముంచుకొస్తుంది,

కోటీ : ఆవిడ నీకుతెలుసా?

పరం : తెలియాలటండీ! ఆ వర్ఛస్సు, ఆ ఠీవి, ఆ సుమంగళీ స్వరూపం చూస్తుంటే మనిషి వ్యక్తిత్వం తెలీదంటారా ?

కోటీ : ఆవిడ నన్నేం సుఖపెట్టలేదు.

పరం : సంసారమన్నాక కలతలు లక్షవస్తాయి. అందుకని సుఖపళ్ళేక పోయామూ అంటే భ్రమే అవుతుంది. నా సంసారమే తీసుకోండి. నా భార్యను తమరు చూశ్ళేదుగానీ—

కోటీ : చూశాను!

పరం : ఇహనేం! తమరికో అభిప్రాయం ఏర్పదే వుంటుంది.

కోటీ : అలాంటి అభిప్రాయమేం ఏర్పడలేదు.

పరం : నా ఉద్దేశం అదికాదు. ఆమె వ్యక్తిత్వం మీద అభిప్రాయం. (కోటీశ్వరయ్య దగ్గరగా వస్తూ) తమకు మరోలా అనుకోకుండా వుంటే ఒకమాట బాబుగారూ....

కోటీ : ఏమిటి?

పరం : తమరు పునర్వివాహం....

(వాళ్లు మాట్లాడుకుంటూ వుండగానే శాస్త్రజ్ఞుడు వస్తాడు. శాస్త్రజ్ఞుడు మాట్లాడుతున్నప్పుడు కోటీశ్వరయ్య పరంధామయ్యలు మాట్లాడుకుంటూనే వుంటారుగాని వాళ్ళ మాటలు ఎవరికీ వినిపించవు. పెదవులు మాత్రం కదులుతూ వుంటాయి, వాళ్ళ సంభాషణ మహాతీవ్రంగా వుంటుంది. కోటీశ్వరయ్య మొదట్లో కోపంగా వుంటాడు. గబ గబ ఫొటో దగ్గరకువెళ్ళి 'ఎలా వివాహం చేసుకోవాలి?' అన్నట్లుమాట్లాడాడు. పరంధామయ్య అతన్ని అనునయిస్తునట్టు నటించాలి. శాస్త్రజ్ఞుడు మాటలు పూర్తయేవరకూ వాళ్ళిద్దరూ అలానే కిందామీదా పడుతూ వుంటారు)

శా : ఇదీ కోటీశ్వరయ్య మనస్సు, భార్యపోయాక అతను చాలా మారిగిపోయాడు. అది మానసికమైనబాధ. ఆ బాధ అందరికీ ఒకటే. ఈ కోణంలో ఆయన మామూలు మనిషే! బాధకి కృంగి పోతాడు. జ్ఞాపకాలతో సతమత మవుతాడు. ఆ బాధపడేటప్పుడు మనిషివేరు, డబ్బువేరు అయిపోతారు.... ఆయనకు ధర్మగుణం కూడా వుంది. ఇంటికివచ్చిన ఏఅతిథినీ పొమ్మనడు. అదిఆయన ధర్మగుణమే కావచ్చు. లేదా తనపేరు పదిమందీ చెప్పుకోవా లనే స్వార్థమేకావచ్చు. ఏదిఏమైనా ఆయన చాలా ధానధర్మాలు చేశాడు. సాక్ష్యంగా కన్నమాంబ ధర్మాసుపత్రి, కన్నమాంబ కాలేజి, కన్నమాంబ వితంతు శరణాలయం.

(శాస్త్రజ్ఞుడు ఈ మాటలు అంటూనే నిష్క్రమిస్తాడు. అతని మాటలు అయిపోగానే యింతరవకూ Lip movement లో ఉన్న పరంధామయ్య, కోటీశ్వరయ్య మాటలు బయటకు వినిపిస్తాయి. కోటీశ్వరయ్య 'ఫొటో' దగ్గర్నుంచి, సర్రున ముందుకి వస్తాడు)

కోటీ : అనవసరమయ్యా! నా నిశ్చయం ఒకటే; అదెన్నటికీ మారదు.

పరం : చిత్తం తమరలా శలవిస్తే పునర్వివాహానికి నేనేం చెప్పలేనను కోండి, (తులసి లోపలినుంచి వచ్చి కోటీశ్వరయ్య పడకగది లోకి వెడుతుంది) ఎవరు బాబుగారు ఆ అమ్మాయి?

కోటీ : భిక్షాలు కూతురు.

పరం : భిక్షాలు కూతురా?

కోటీ : ఏం అంతగా ఆశ్చర్యపోతున్నావ్?

పరం : భిక్షాలు కూతురంటే నమ్మశక్యం కావటంలేదు.

కోటీ : నిన్ను నమ్మమన్నదెవరు?

పరం : నిజంగా భిక్షాలుకి యింత అందమైన కూతురుందా?

కోటీ : నీకు మాత్రం అంత అందమయిన భార్యలేదా?

పరం : ( కొంచెం ఆశ్చర్యపోయినా తమాయించుకుని ) మొత్తానికి బాబుగారు ఏదో అనుకున్నాను!

[లాయరు- చేతిలో Imaginary ఫైల్సుతో వస్తాడు]

లా : నమస్కారాలండి!

కోటీ : రండి. ఏవయింది! పండా, కాయా?

లా : ఈ లాయర్ వ్యాఘ్రేశ్వరం పట్టినకేసు ఎప్పుడైనా కాయి అయిందా ?

పరం : చిత్తం! అందుకే అయ్యగారు తమర్ని నియమించారు.

లా : (కోటీశ్వరయ్యకు Imaginary Papers అందిస్తూ)చూడండి ఈ దావాకూడా మనమే గెలిచాం. మొత్తం మూడున్నర కోట్లు ప్లస్ అయిదువేల ఎకరాల భూమీ మనకి సంక్రమించినట్లు లెఖ్ఖ. చిత్తగించండి.

(లాయర్ అందించిన కాగితాలు అందుకుని చూస్తూ వుంటాడు కోటీశ్వరయ్య. లాయరు అతనికి వివరిస్తూవుంటాడు. పడక గదిలోనించి తులసి వస్తుంది. పరంధామయ్య ఆమె దగ్గరగా వెడతాడు)

పరం : అమ్మాయమ్మాయ్!

తుల : [ఆగి ఎగాదిగా చూస్తుంది వింతగా]

పరం : (తనూ అలానే ఆమెనుచూసి) నీ పేరేమిటో?

తుల ; పచ్చీసు.

పరం : బావుంది. బావుంది. ఇంటిపేరు 'పైలా' వారా?

తుల : కాదు పంచకళ్యాణివారు.

(కాగితాలు చూసుకుంటున్న కోటీశ్వరయ్య, లాయరులు ఎందుకో ఫక్కున నవ్వారు. తనమాటలువిని నవ్వారనుకున్నాడు పరంధామయ్య. వెనక్కితిరిగి వాళ్ళిద్దర్నీ ఒకసారిచూసి, తనని కాదని నిర్ధారణ చేసుకున్నాక .. )

పరం : అన్నట్టు భిక్షాలు కూతురువటగా?

తుల : అవునటగా!

పరం : మాటలొచ్చే!

తుల : కుక్కనుకాదు మరి.

పరం : అయితే, నేనా కుక్కను!

తుల : నేనలా అనలేదు.

పరం : నువ్వు నిజంగా భిక్షాలు స్వంత కూతురివేనా ?

తుల : జానకమ్మగారు నిజంగా మీ స్వంత భార్యేనా అన్నట్టు—అదేం ప్రశ్న వెధవప్రశ్న!

పరం : నీ భాషలో యాసలేదే?

తుల : ఉంటే మీ యింటో దాసీదానిగా తీసుకుంటారా ?

పరం : అమ్మబాబోయ్! నిన్నే?

తుల ; ఏం, చీపురు తిరగేస్తారా జానకమ్మగారు?

పరం ; ఛ. ఛ! అంత పెట్టమారి వాణ్ణనుకున్నావా?

తుల ; తెలుస్తూనేఉంది.

పరం : ఏవిటి తెలీడం?

తుల : తమ మగసిరి!

[కోటీశ్వరయ్య లాయరు మళ్ళీ తమ మాటల్లో ఫకాలున నవ్వుకుంటారు.]

పరం : ఎందుకా నవ్వులు?

కోటీ : (వెనక్కి చూస్తాడు)

పరం : తమర్నికాదు బాబుగారూ అన్నది!

కోటీ : నువ్వక్కడేం చేస్తున్నావ్ ?

పరం : చిత్తం ఏంలేదు. ఏదో లోకాభిరామాయణం.

కోటీ : ఎంతయినా నీకా ఆడతనం పోలేదయ్యా.

తుల : (నవ్వుకుంటూ పోయింది)

పరం : (కోటీశ్వరయ్య లాయర్ల దగ్గరకు వస్తాడు)

కోటీ : (లాయరుతో) మీ ఫీజు...

లా : ఫీజా! వెధవఫీజు! మీ దగ్గర నా ఫీజెక్కడికి పోతుందని అంత కంగారుగా యిచ్చేస్తామంటున్నారు!

[అయినా కోటీశ్వరయ్య జేబులోనించి Imaginary చెక్కుబుక్కు తీస్తాడు. పరంధామయ్య Imaginary పెన్ తీసి సిరా కక్కుతుంటే తలకి తుడిచి కోటీశ్వరయ్యకు అందిస్తాడు. కోటీశ్వరయ్య 'రాసి'- 'చెక్' చించి లాయర్కిచ్చాడు]

పరం : బ్లాంక్ చెక్కా?

కోటీ : [లాయర్తో] అందులో మీకెంత కావాలో అంతా రాసుకోండి.

లా : ఆహాహా! అపర దానకర్ణులు కదండీ మీరు! ఎవరో నేనిక్కడికి వచ్చిన కొత్తలో మీ గురించి చెప్పుకుంటూంటే అవ్వన్నీ కట్టు కథలనుకునేవాణ్ణి. స్వయంగా చూస్తేనేగాని తెలీటంలేదు.

డాక్ట : (వస్తాడు) గుడ్‌మార్నింగ్‌సార్.

కోటీ : రండి డాక్టర్.

డాక్ట : మిమ్మల్నెక్కువగా మాట్లాడొద్దని చెప్పాను. పరీ నీరసించి పోతే ఎంత ప్రమాదమో ఆలోచించారా,

పరం ; అవును బాబుగారూ! తమరు చల్లగా వుంటేనే కదా పదిమంది బతుకుతారు?

లా ; తమరు డాక్టర్‌గారు చెప్పినట్టు విశ్రాంతి తీసుకోండి_ పన్లం టారా_అవి మాకు విడిచిపెట్టేసెయ్యండి.

డాక్ట ; ఉఁ ఉఁ. వారినిమాట్లాడించకండిక .... కోటీశ్వరయ్యగారూ!....

['ఇలా ఈ కుర్చీమీద కూచోండి' అన్నట్టు డాక్టర్ సైగ చేశాడు.డాక్టర్ అతని చెయ్యిపట్టుకుని నాడిచూశాడు. Imaginay స్టెతస్కోప్‌తో పరీక్షించాడు, నాలిక చాపించాడు. కళ్లు చూశాడు. గొంతుచూశాడు. డాక్టర్ యిలా కోటీశ్వరయ్యను పరీక్షిస్తూ వుం డగా లాయర్ బ్లాంక్ చెక్ తీసుకుని అందుమీద Imaginary పెన్‌తో అక్షరాలు రాస్తూ వుంటాడు. పరంధామయ్య వెనకనించి వెళ్ళి తొంగిచూస్తాడు. గుండె బాదుకున్నాడు.]

పరం : అయిదు లక్షలే!

లా : ష్! నీ సొమ్మేం పోయిందయ్యా?

పరం : అన్యాయం వ్యాఘ్రేశ్వరంగారూ! అన్యాయం.

లా : ఏమిటి అన్యాయం? మూడున్నరకోట్లూ, అయిదువేల ఎకరాలూ స్వంతం చేసుకోవడం ఆయనకు అన్యాయంకాదా?

పరం : కాని అదంతా న్యాయమేనని కోర్టులో బల్ల గుద్ది మరీ వాదించారే.

లా : పిచ్చివాడా! అదికోర్టు. ఇది జీవితం. అక్కడ జరిగేదంతా యిక్కడి మన నిజజీవితాలకు సరిగ్గా తల్లక్రిందులు. వాదించడం నా వృత్తి, గడించుకోవడం నా ధ్యేయం, అన్యాయమంటావా? ప్చ్! పిచ్చివెధవలాదే మాటలు.

పరం : ( ముక్కుమీద వేలేసుకుంటాడు ) అన్నా! ఏం లోకం! ఏం మనుషులు!

లా : ఆ లోకంలో మనిషి బ్రతుకు బ్రతకాలంటే యీ బ్రహ్మ విద్యలన్నీ నేర్చుకోవాలయ్యా పిచ్చివాడా!

పరం : చిత్రం! చిత్రం! అయ్యా! నాకో విషయం తెలీకడుగుతాను తమ నామధేయం వ్యాఘ్రేశ్వర మనేది తమనాన్నగారు పెట్టారా, అమ్మగారుపెట్టారా?

[డాక్టరు పరీక్ష అయిపోయింది. కోటీశ్వరయ్య నిలబడ్డాడు.]

కోటీ : ఇంకా ఏమన్నా పరీక్షిస్తారా?

డాక్ట : అవసరంలేదు. ఈ మందులు రాసిస్తాను. రోజూ వాడుతూ వుండండి.

లా : అయ్యో తమరు లేచిపోతున్నారు, కాసేపు విశ్రాంతి తీసుకోండి.

డాక్ట : (Imaginary Prescription అందిస్తూ) విశ్రాంతి గురించి మీరు చెప్పడమేమిటి? నేను చెప్పాలి. మందులు గురించి నాకు తెలుసా....తమరికి తెలుసా?

పరం : అవునండి వారికి తెలుసా తమరికా?

డాక్ట : మర్నేను శలవు పుచ్చుకుంటాను

కోటీ ; ఉండండి! మీ విజిటింగ్ ఫీజు.

డాక్ట : దానికేం తొందర.

పరం : తీసుకోండి.

కోటీ : (Imaginary చెక్ యిస్తాడు.)

డాక్ట : (అందుకుని) బ్లాంక్ చెక్కా?

కోటీ : మీ యిష్ట మొచ్చినంత రాసుకోండి.

డాక్ట : కోటి రూపాయలు రాసుకోవంటారా, (వ్యంగ్యంగా)

కోటీ ; ఈ కోటీశ్వరయ్యను పరీక్షిస్తున్నారా, రాసుకోండి.

[డాక్టర్ నవ్వుకుంటూ ఒకమూలకి వెడతాడు, పరంధామయ్యకు ఇంతింతడబ్బు చెక్కులరూపంలో యిచ్చెయ్యడం బాధనిపిస్తుంది. కోటీశ్వరయ్యకు ఏదో నూరిపోస్తూ వుంటాడు. ఆ మాటలు ప్రస్తుతం అవసరంలేదు. గనుక డాక్టర్, లాయర్ మాటలు వినిపిస్తాయి. డాక్టర్ Imaginary చెక్‌మీద అంకెలు వేసుకుంటూ వుండగా, వెనకనించి లాయర్ చూస్తూ వుంటాడు. పరంధామయ్య చూస్తాడు?]

పరం : రె....రె.... రెండున్నర లక్షలు!

[డాక్టర్ పరంధామయ్య వేపు తీవ్రంగా చూశాడు. పరంధామయ్య కోటీశ్వరయ్య వెనకచేరి బాధలు మొదలు పెట్టాడు. ఈ మాటలు వినిపించవు.]

లాయ : (భుజం మీద చెయ్యివేసి) తక్కువే రాసుకున్నారేం?

డాక్ట : రోజూ వస్తుంటానుగా!

లాయ : అదృష్టవంతులు. రోజుకి రెండున్నర!

డాక్టరు : తమరేం తీసిపోయారు ?

లా : నా మాటే చెప్పారూ? తగూలొస్తే ముట్టినట్టు; లేకపోతే ఖాళీయేగా?

డా : తగువులు కల్పిస్తూ వుండండి!

లా : మనం కల్పించనవసరం లేకుండానే యిప్పుడు మిల్లులో స్ట్రైయికులవుతూ వున్నాయ్‌గా?

డా : పేశారన్నమాట కోటలో పాగా! మరి చెప్పరేం?

[చేతులు కలుపుకుని యిద్దరూ పోతారు. ఇంత వరకూ Silent గా నూరిపోస్తున్న పరంధామయ్య మాటలు బయటకు వినిపిస్తాయి]

కోటీ : పోనీవయ్యా! ఇందులో ఎవరు బాగుపడితే యేం?

పరం : అదికాదు బాబుగారూ! వాళ్ళు బాగుపడటం కోసం అన్యాయం కావడం నేనుచూస్తూ వూరుకోలేను.

కోటీ : నీకేమైనా కావాలా ?

పరం : ( ఆశవచ్చింది. కాని వెంటనే దిగజారిపోయాడు. ) ఇంత కాలంనించి తమ పాదాలవద్ద పడివున్నాను. నేనెప్పుడూ అంత డబ్బుకి ఆశపడలేదు. అడగలేదు తమర్ని!

కోటీ : అడుగిప్పుడు.

పరం : నోట్రావటంలేదు.

కోటీ : ఏం?

పరం : నేను లాయర్నికాదు, డాక్టర్నికాదు. తమకేం మేలుచేసి, తమ దగ్గర్నుంచి అంతపైకాన్ని అడగ్గలను?

కోటీ : ఆలోచించు.

పరం : నాకేం తోచటంలేదు.

కోటీ : రంభలాంటి భార్యవుందినీకు. నీకు నువ్వే అంటూ వుండే వాడివిగా!

(పరంధామయ్య ఆశ్చర్యపోతాడు. 'బాబుగారూ' అని వారించబోతాడు. కోటీశ్వరయ్య భావయుక్తంగా నవ్వి అతని భుజంమీద తడతాడు. జేబులోనించి Imaginry చెక్‌బుక్ తీసి, ఒకకాగితం మీద సంతకంచేసి బ్లాంక్ చెక్ చించియిస్తాడు: అందుమీద నీ యిష్టం వచ్చినంత రాసుకోమన్నట్టు చూస్తాడు, పరంధామయ్య చేతులువణుకుతాయి. కానిపని చేస్తున్నట్టు బాధ పడతాడు. కోటీశ్వరయ్య అతనిబుజంతట్టి, నవ్వి పడకగదిలోకి వెడుతూ ద్వారం దగ్గర ఆగి చిరునవ్వుతాడు. వాచీ చూసుకుని ఆవులిస్తాడు. అతని భావం పరంధామయ్యకు అర్థమయింది. బరువుగా బయటకువచ్చి, నిట్టూర్పు విడిచి మళ్ళా పడకగది వేపు చూస్తాడు. 'వెళ్ళి త్వరగా రమ్మన్నట్టు' కోటీశ్వరయ్య నవ్వుతాడు. పరంధామయ్య వెళ్ళిపోతాడు.)

(కోటీశ్వరయ్య 'రంభలాంటి భార్యవుందినీకు; నువ్వే అంటూంటావుగా' అని అన్నప్పుడే శాస్త్రజ్ఞుడు రంగస్థలం మీదికి వస్తాడు. తర్వాత కోటీశ్వరయ్య, పరంధామయ్యల మధ్య మూకాభినయం జరుగుతూ వుండగా శాస్త్రజ్ఞుడు దానికి తగిన విధంగా వ్యాఖ్యానంచేస్తూ వుంటాడు)

శా : మనిషికి పతనావస్థ ప్రారంభ మవుతోంది. సమాజంలో యే జీవితాన్ని సన్మార్గంలో నడుపుకోవాలని మనిషి కలలు కంటున్నాడో అదేజీవితాన్ని చేజేతులా నాశనం చేసుకుంటున్నాడు.

నైతిక పతనం అందుకు దాపురిస్తోంది. ఒకరు (కోటీశ్వర య్యను చూపిస్తూ) ప్రేరేపిస్తున్నారు; మరొకరు (పరంధా మయ్యను చూపిస్తూ) పడిపోతున్నారు. అది అనివార్యమా?

మనిషి బ్రతకాలి. బ్రతుక్కి లక్షమార్గాలున్నాయి. సన్మా ర్గంలోకి మనిషి అంత సుళువుగా వెళ్ళలేడు. వాడికి అడ్డదార్లూ నిచ్చెనలూ కావాలి. బ్రతుకుని ఈడ్చుకుపోవాలి, ఎలాగయినా సరే! ఏ విధంగానయినాసరే! అది తప్పని తెలుసు. కాని తప్ప దనుకుంటున్నాడు. డోలాయమానస్థితి. ఎటూ నిశ్చయించుకో లేని లోలకం మాదిరి. చివరికి తెగించాడు. గుండె రాయి చేసు కున్నాడు. నీతి నియమాలు పిచ్చివాళ్ళ 'సుగుణా'లనే నిర్ణయా నికి వచ్చేశాడు. ( ఇప్పుడు పరంధామయ్య నిష్క్రమించాడు ) మనిషి పడిపోవడం ప్రారంభమయాక ఎంతవరకూ పడిపోతాడో ఎవరూ వూహించలేరు.

*       *       *

(ఇప్పుడు స్టేజంతా ఖాళీ! ఒక్క శాస్త్రజ్ఞుడే వుంటాడు. శాస్త్రజ్ఞుడు స్టేజీకి రెండోవేపుకి వెడతాడు. ఒకకుర్చీ తీసేసి వింగ్ లోపల పెట్టేస్తాడు. ఇప్పుడు స్టేజిమీద మూడు కుర్చీలు మాత్రమే వున్నాయి. ఇది పరంధామయ్య యిల్లు)

శా : ఇది పరంధామయ్య పెంకుటిల్లు ఎప్పుడో తాతలు కట్టించి యిచ్చారు దాంట్లోనే అతను బ్రతుకుతున్నాడు. అందులోనే చచ్చిపోతాడు. కాని చావకూడదని అతని పట్టుదల. బ్రత కాలి, ఎలాగయినా బతికెయ్యాలి. అదీ అతని ధ్యేయం. బయటనించి పరంధామయ్య అడుగులో అడుగు వేసుకుంటూ వస్తాడు. మధ్యగదివేపు వెడతాడు. లోపల భార్యవుంది, గతు

క్కు మన్నాడు. గప్పున మళ్ళీ స్టేజీమీదకి వచ్చేస్తాడు. జానకి చీర చెంగుతో చేతులు తుడుచుకుంటూ వస్తుంది)

శా : (జానకమ్మనుచూపిస్తూ) పరంధామయ్య భార్యగా కనిపించే ఈ స్త్రీ భీష్మలు కూతురు తులసికాదు, ఆమెవొక స్త్రీ లోకానికి ప్రతినిధి. ఆమె మీ కూతురేకావచ్చు; మీ తోబుట్టువే కావచ్చు. ఏమయినా ఆమె వో ఆడకూతురు. (ఈ మాటలని శాస్త్రజ్ఞుడు స్టేజికి మూలగా వెళ్ళి నిలబడతాడు)

జాన : అదేం యింత త్వరగా వచ్చేశారు? [ ఆశ్చర్యంగా అతని చేతులవేపు చూస్తుంది] అదేం వట్టిచేతుల్తో వచ్చారు: కోటీశ్వ రయ్యగారు డబ్బేం సర్దలేదా?

పరం : సర్దారు.

జాన : మరి బజార్నుంచి సరుకులేం తేలేదేం?

[పరంధామయ్యకు ఛప్పున ఆవేశం వస్తుంది. 'జానకీ' అని ఆమె బుజాలు పట్టుకుంటాడు. ఛీ ఛీ! ఇలాంటి విషయం ఆమెతో చెప్పడమా!' అన్నట్టు తల పంకించి చేతులు వాల్చే స్తాడు]

జాన : ఏవిటండీ! ఏవిటలావున్నారు?

పరం : ఏంలేదు జానకీ: ఏం లేదు.

జాన : ఏవిటండీ ఆ పిచ్చిచూపూ మీరూను? ఆయనిచ్చిన డబ్బేది?

పరం : (Imaginary చెక్ యిస్తాడు.)

జాన : ఇదేమిటి?

పరం : బ్లాంక్ చెక్కు. అందులో మనకి కావలసినంత రాసుకోవచ్చు.

జాన : కావలసినంత రాసుకోవడమేమిటండీ? ఎందుకాయన అంత డబ్బు యివ్వటం?

పరం : జానకీ!

జాన : చెప్పండి.

పరం : వద్దు జానకీ వద్దు! నువ్వు తెలుసుకోకూడదు.

జాన : ఏం? ఏవ(న్నా అన్యాయం చేశారా?

పర : అన్యాయమా?.... ఆ(.... అన్యాయవే(చెయ్యాలి.... అన్యాయవే( చెయ్యాలి.

జాన : గొప్పవనే వద్దు. మనకలాంటి పాపపు సొమ్ము మనకువద్దు. వెళ్ళి యిచ్చేసి రండి.

పరం : వీల్లేదు. పాపానికి లోకంలో అర్థంలేదు జానకీ, నిర్వచనం అంతకంటేలేదు.

జాన : ఉంది. పైనించి చూసేవాడొకడున్నాడు.

పరం : లేదు. లేదు జానకీ! వుంటే ఈ నిర్లిప్తత స్తబ్దత వుండదు. వద్దు జానకీ వద్దు. పాపం పుణ్యం అనేవి పట్టుకునే యిన్నాళ్ళూ మన్ని మనం చంపుకున్నాం, ఇంకా ఎంతకాలం చంపుకోటం? మోసమే మనచుట్టూ వుంది. పాపమే మనల్ని ఆవరించివుంది. మనం ఒక్కళ్ళం పుణ్యం అని దేవుళ్లాడితే మనం చివరికి గోతిలో పడతాం. నేనుడాక్టర్నికాదు. లాయర్నికాదు. చదువు లేదు. ఏమీలేదు. మోసం చెయ్యటం చేతకావటంలేదు' నాకు చాతనయిన దాన్ని లోకం హర్షించదు .... వెళ్ళిపోకు జానకీ (ముఖం చూస్తాడు దీక్షగా) మోసాన్ని మోసంతోనే మోసగించాలి. వుండు జానకీ.

జాన : ఎందుకలా పట్టిపట్టి చూస్తారు?

పరం : నీ ముఖంలో.... నీ ముఖంలో... తులసి....

జాన : తులసెవరు?

పరం : చెప్తా.... చెప్తా... నువ్విక యింటోకి వెళ్ళిపో... మనం ఎలాగయినా బ్రతకాలి. ఏదో వుపాయంతో.... ఏదో వుపాయంతో....

[ పరంధామయ్య పిచ్చివాడిలా పరుగెత్తుకుని పోతాడు. ఓమూలగా నిలబడి దృశ్యాన్ని చూస్తున్న శాస్త్రజ్ఞుడు రంగస్థలం మధ్యగా వస్తాడు. జానకమ్మకు—భర్త అంత ఛప్పున ఏ ఉపాయం తోచి వెళ్ళిపోయాడో అర్థంగాక—అలా నిలబడి వుండిపోయింది. శాస్త్రజ్ఞుడి మాటలు ఆమెకు వినిపించవు. అతని ఉనికే ఆమెకు తెలీదు. శాస్త్రజ్ఞుడు మాట్లాడుతూ వుండగా మధ్యలో యెప్పుడో రంగం విడిచి లోపలికిపోయింది.]

శా : మానవుడు దానవుడై పోయే పరిస్థితి యిది. అతనొక విచిత్ర విపత్కర పరిస్థితిలో పడిపోయాడు. అక్కడ అతనికంతా అంధకారం, అతనికేవో ఉపాయాలు తోచాయి. అధమాధమైన వుపాయాలే. మీరూ నేనూ, ఎవరూ హర్షించనివి. కాని అతని దృష్టి బండబారి పోయింది. యుక్తా యుక్త జ్ఞానం నాశనమై పోయింది. ఎంత అధుక్కి దిగజారిపోయాడో అతను గుర్తించ లేకపోయాడు. సమాజంలో యిలాంటివాళ్ళు లేకపోలేదు. కాని మీరు వారిని స్టేజీమీద చూసేందుకు యిష్టపడలేరు కాని నాకు తప్పదు. దృశ్యాన్ని అతినగ్నంగా ప్రదర్శించి చూపించాలి. తద్వారా—మనిషియెక్కడికి పడిపోతున్నాడో సమాజంలోఎన్ని కృత్రిమశక్తులు విజృంభించి మనిషిని రాక్షసుడుగా చేసి పారేస్తున్నాయో చూపించడం నా విధి. అతనికి యిప్పుడు యింతకంటే

ఘోరమైన వుపాయంతోచింది. మరొకరు సర్వనాశనమైపోయినా వాళ్ళ అస్థి పంజరాలమీద తను భవంతులు కట్టుకోవాలి. అదుపూ, అజమాయిషీలేని సమాజంలో యిలాంటి నీచపుశక్తులు అధమాధమ భావాలు లేవడం సహజమే।

[శాస్త్రజ్ఞుడు మాట్లాడుతున్నప్పుడు మధ్యలో జానకమ్మ నిష్క్రమిస్తుంది. ఒక క్షణం శాస్త్రజ్ఞుడు వొక్కడే రంగ స్థలం మీద మాట్లాడుతూ వుంటాడు. మాట్లాడటం పూర్తయాక వొక సారి రంగస్థలాన్ని పరీక్షిస్తాడు. మరో రెండు కుర్చీలు తీసుకొని వింగ్‌లో బయట పెట్టేస్తాడు.

o o o

[ఇప్పుడు రంగస్థలం మీద ఒకటే కుర్చీవుంది. ఇప్పుడిది భిక్షాలు గుడిసె]

శా : ఇప్పుడిది భిక్షాలు గుడిసె. అతను కట్టుకోలేదు. కోటీశ్వరయ్య కటించియిచ్చాడు. ఇలాంటి లక్షమందికి కట్టించి యిచ్చాడు.

(శాస్త్రజ్ఞుడు మాట్లాడడం మొదలు పెట్టగానే భూషణ్ వచ్చాడు. రాగానే ముందు భిక్షాలుని లాగుంది పిలిచాడు—భిక్షాలు రాడు తులసివచ్చింది. భూషణ్‌ని చూడగానే ఆమెముఖం విప్పారుతుంది. నమస్కారంచేసి దగ్గరగా వచ్చింది. భూషణ్ ముఖంలో చిరునవ్వు కనిపించదు. తులసి ఆశ్చర్యంగా చూస్తుంది. అలా వుండడానికి కారణం యేమిటని అడిగింది. భూషణ్ ఉద్రేకంగా మాట్లాడుతుంటాడు. అయితే శాస్త్రజ్ఞుడి మాటలు పూర్తయేవరకూ ఆ గొడవమాత్రం వినిపించదు. నటన మాత్రం జరుగుతూనే వుంటుంది.)

శా : (తులసి దగ్గరకు వచ్చాడు) ఈమె భిక్షాలు కూతురు తులసి.

ఆమెను విడిగా చూస్తే దాసీ అనుకోలేరు. భిక్షాలుకూతురంటే నమ్మలేరు. (భూషణ్ దగ్గరకువచ్చాడు) ఇతనిపేరు భూషణ్ ఇతను ఎవరో ఎవరికీ తెలీదు ఈ ఉళ్ళో. అబ్రహాంలింకన్ కావచ్చు; గాంధీజీ కావచ్చు; లేదా కొన్ని కొన్ని స్వార్థాలతో కొంతమందను వెనకేసుకుని కేకలువేసే బూర్జువావిప్లవకారుడు కావచ్చు. అతన్లో అగ్నిపర్వతం పొగలు చిమ్ముతోంది. శిఖలు లేస్తున్నాయి.ఆ లావాలో ఎందరు మాడి దగ్ధమైపోతారో తెలీదు. లేదా తనే నాశనం కావచ్చు.

(ఇక శాస్త్రజ్ఞుడు ఎప్పుడయినా నిష్క్రమించొచ్చు.)

భూ : ఇక నేను ఆగను ఆగలేను తులసి ఏదోఒక నిర్ణయానికిరావాలి.

తుల : నా మాట వినండి: యింకా సమయంరాలేదు. ఇంతకాలం ఓపిక పట్టారు. మరో పది దినాలు శాంతించడంలో మన సొమ్మేం పోదు.

భూ : ఈ మధ్యలో కొందరు నాశనమైపోతారు.

తుల ఏమీకాదు. మీరే చూస్తారుగా?

భూ : నీ ధైర్యమేమిటో నాకర్థం కావటంలేదు. ఇప్పటికి మూడేళ్ళ యింది బోనస్‌లుయిచ్చి. పోనీ లాభాలు రావడంలేదా అంటే-ఏడా దికి పదికోట్ల రూపాయలు వస్తున్నాయ్. ప్రభుత్వం, మిల్లు ఉత్పత్తి చేయాల్సిన లైసెన్సుకి నాలుగురెట్లుఅధికంగా ఉత్పత్తి చేసి చీకటి బజార్లో అమ్ముకుంటున్నారు. బోర్డ్‌ఆఫ్ డైరెక్టర్సు లో ప్రభుత్వ ప్రతినిధి ఒకడున్నాడు. వాడు లంచం తిని నోరు కదపడు. ఎక్సైజ్‌వాళ్ళు, ఇన్‌కమ్‌టాక్స్ వాళ్ళకి కోటీశ్వరయ్య మహారాజ పోషకుడు. అసెంబ్లీలో పార్లమెంట్‌లో కోటీశ్వరయ్య తాలూకు మనుషులు లెక్కకు మించి ఉన్నారు. ప్రజలకు పని

కొచ్చే యే చట్టాన్నీ వాళ్లు సమ్మతిండరు. సంఖ్యాబలం, మూర్ఖుల బలం వుందక్కడ. ఇలాంటి పరిస్థితుల్లో ఘట్టిగా అరిస్తే మీదిక్కొన్నచోట చెప్పుకోమంటున్నాడు. సరే యిచ్చినప్పుడే పుచ్చుకుందా మంటే యిక్కడ ఆకలి.

తుల : కోటీశ్వరయ్యగారిది చాలా మంచిమనస్సు భూషణ్! ఆయన వెనుకనున్న బలగం ఆయన్ని చెడుపుతోంది.

భూ : అయితే నువ్వనేదేమిటి?

తుల : నే నాయనకు చెప్తాగా?

భూ : నువ్వా?

తుల : అవునుభూషణ్! ఆయనకు నచ్చచెప్తే వినొచ్చు,

భూ : వద్దు తులసీ! నువ్వీ సుడిగుండంలో చిక్కుకోవద్దు. ఇదో మహా సముద్రం, అగ్నిపర్వతం. ఆ మధ్యకు నువ్వురావద్దు.

తుల : రాముడికి ఉడతకూడా సాయం చేసింది.

భూ : అందువల్లే వారధి పూర్తవలేదు. నీ కింకా లోకంతెలీదు తులసీ! తోదేళ్ళని నువ్వు చూడలేదు. వాటిమధ్య నువ్వు తిరగలేదు. నే ననుభవిస్తున్నాను. అదు గడుగునా గండం, ఏ క్షణాన ఏమై పోతానో తెలీదు? అలాంటి బోనులోకి నువ్వు రావద్దు.

తుల : అయితే తగూలాటకి దిగుతారా?

భూ : నీకు అర్థంకాదు తులసీ? నువ్వు స్త్రీవి. నువ్వీ రాయబారాన్ని నడిపితే వాళ్ళంతా కలిసి నిన్ను అదకత్తెరలో యెలా యిరికిం చేస్తారో తెలుసా ?

తుల : నేనేం చిన్నపిల్లనుకాను.

భూ : అందుకే నా భయం తులసీ! చివరికి యెటుపోయి ఎటొచ్చినా యీ ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేసిన దానవ్ నువ్వే అవుతావ్. ఒక ధ్యేయంతో సాగే ఈ ధర్మయుద్ధం మరో మార్గానికి మళ్ళిపోతుంది. తర్వాత.... తర్వాత ....ఏమో.... నేనేమైపోతానో! నాలో సహనం చచ్చిపోతుంది.... వ్యక్తిగతమయిన కక్షలు మొదలవుతాయి...

తుల : (నిట్టూర్పు) అయితే ఒక విషయం చెప్పు భూషణ్! నా మీద నీకెలాంటి అభిప్రాయం వుంది? కేవలం నన్ను భార్యగానే స్వీకరించాలను కుంటున్నావా? నీ బాధల్లో, ధ్యేయాల్లో, ఉద్యమాల్లో నేనూ పాలుపంచుకో కూడదా?

భూ : నా అభిప్రాయం అదికాదు తులసీ.

తుల : నిన్ను నేను రక్షించుకోవాలి భూషణ్! నీ ఉద్యమం గొప్పదే కావచ్చునీ. ఆశయాలూ ఆశలూ ఉన్నతమైనవే కావచ్చు. కాని వాటినికొందరు హర్షించరు. సమ్మతించరు. ఆ కొందరే మన్ని సర్వనాశనం చేసెయ్యగలరు.

భూ : అయితే లొంగిపోమంటావా ?

తుల : ఓటమి మాట యిప్పుడెందుకు? సవాలక్ష వుపాయలున్నాయ్.

భూ : ఉపాయాలతో వాళ్ళు లొంగరు?

తుల : అయితే మరి నేను నీకు నచ్చచెప్పలేను. నిన్ను నేను తప్పుగా అంచనా వేశానేమో అన్న అనుమానం కలుగుతోంది. అందరికీ మాటాడే హక్కు-వుందన్నావ్! కాని అభిప్రాయాలు వినటంలేదు. నీలోనూ బలహీనతలు వున్నై! అణగదొక్కాలనే భావం వుంది. అధికారం చెలాయించాలనే మౌఢ్యం వుంది. నీకు ఎవరూ యెదురు చెప్పకూడదు. నీ వాక్యమే శిలాక్షరం

కావాలి. సలహాలు నీకు పనికిరావు, నీ వాదనలో లోపాలున్న వంటే ఒప్పుకోవు. అదే నీ బలహీనత. వెళ్ళిపో భూషణ్! వెళ్లిపో.

(భూషణ్ కోపంగా వెళ్లిపోతాడు. అతను వెళ్ళిపోగానే తులసి ఏడ్చింది. కొంతసేపయిన తర్వాత బయటనించి భిక్షాలు వచ్చాడు)

భిక్షా : ఎవరమ్మ ఆ యెల్లిపోయేది - బూసనం బాబేనా!

తుల : (కళ్ళు తుడుచుకుని) అవున్నాన్నా:

భిక్షా : ఏవంటాడు?

తుల : ఏంలేదు?

భిక్షా : పిచ్చితల్లీ !

తుల : అన్నం పెడతాను లేనాన్నా!

భిక్షా : కూడుకేం తొందర? ముందిది సెప్పు: బూసనం బాబంటే నీకిస్టవేనా ?

తుల : తర్వాత మాటాడొచ్చు,—ఎండన పడొచ్చావు—లే కాస్తంత—

భిక్షా : తరాత్తరాత్తని నాలుగేళ్ళు గడిపేసావు! ఇంకెప్పుడమ్మా మాటాడు కోవడం?

తుల : చెప్తాలే. తొందరలేదు.

[తులసి తండ్రిచెయ్యి పట్టుకుని లోపలికి తీసుకుని వెళ్ళ పోతూ వుండగా. బయటనించి పరంధామయ్య వస్తాడు.]

పరం : భిక్షాలూ !

భిక్షా : తవరా బాబుగారూ! దండాలు దండాలు. రండిబాబూ!

పరం : ఆఁ! వస్తున్నా వస్తున్నా! ఏవిఁటి దీర్ఘంగా చర్చించేస్తున్నావ్? (తులసినిచూసి) అమ్మాయ్ కదూ?

తుల : అవును, అమ్మాయినే!

పరం : చలాకీగా మాటాడుతుంది!

భిక్ష : పిచ్చిపిల్లండి.

పరం : అందంగా వుందిస్మా!

తుల : చిన్న ముక్క—కావాలా?

పరం : ఎందుకు?

తుల : కొరుక్కు—తిందురుగాని.

భిక్ష : తప్పమ్మ! పెద్దోరి నలా అనగూడదు.

పరం : ఫర్వాలేదు. మాటాడ నియ్యవయ్యా! ఈ వయసులో మాటాడక పోతే మరెప్పుడు మాటాడతారు? ఆ మూడు ముళ్ళూ పడ్డాక మళ్ళీ అదో ప్రపంచంలో పడిపోతారు. మూడుముళ్ళంటే గ్యాపకానికి వచ్చింది, అమ్మాయికి పెళ్లి గట్రా ఏవఁన్నా....

తుల : సంబంధాలేవన్నా తీసుకొచ్చారేమిటండి పేరయ్యగారూ?

పరం : నా పేరు పేరయ్య కాదమ్మాయ్!

తుల : మరేవిఁటో?

పరం : పరంధామయ్య.

తుల : ఇంటిపేరు పెళ్ళిళ్ళవారా?

పరం : కాదు (ఏదో జ్ఞప్తికివచ్చి నవ్వేస్తాడు) మొత్తానికి గడుగ్గాయివే! ఆఁ, నామాట నాకప్పసెప్పావ్! ఆఁ! ఏంలేదుభిక్షాలూ, ఇంతకు

ముందొకసారి నీ పేరేవిఁటమ్మాయ్? అని అడిగాను. అంటే పచ్చీసు అంది.

భిక్షా : అసలు సంగతి చెప్పినారు కాదు.

పరం : వస్తున్నా అక్కడికే వస్తున్నా! [తులసి వేపు చూశాడు]

భిక్షా : నువ్వు లోపలికి వెళ్ళమ్మా!

తుల : ఊఁ (లోపలికి పోతుంది)

భిక్షా : ఏవిఁటి బాబుగారూ?

పరం : అదే యెలా మొదలుపెట్టాలో తెలీడంలేదు భిక్షాలు. ఆఁ, ఏం లేదు, చూశావూ! నువ్వు కోటీశ్వరయ్యగారి దగ్గర ఎంత కాలంగా పన్జేస్తున్నావ్?

భిక్షా : సాలా కాలంనించి బాబు!

పరం : అవునా? చాలు! ఏడడుగులు కలిసినడిస్తే చాలు మనిషి అర్థమై పోతాడని మనవాళ్ళు అంటుంటారు. నువ్వు ఎంతో కాలంగా ఆయనదగ్గర పన్జేస్తున్నావ్! నీకు కోటీశ్వరయ్యగారు బాగా అర్థమయ్యే వుంటారనుకుంటాను.

భిక్షా : అవును బాబుగారూ! ఆయనగోర్ది బహు మెత్తని మనసు,

పరం : ఆయన కళత్రం—అదే భార్య—ఆయనగార్ని విచార సముద్రంలో ముంచేసి పోయారు.

భిక్షా : అవును. అయ్యగోరు ఆమెగోర్ని తల్సుకొని కుమిలి పోని చెణం లేదు.

పరం : అదే ఎందుకంటావ్? కన్నమాంబగారంటే ఆయనకు ఎనలేని ప్రేమ. ఆమెపోవడంతో ఆయన నిజంగా పిచ్చివారై అయిపోయారంటే నమ్ము భిక్షాలూ! ఆయన మనందర్నీ పోషిస్తూవున్నాడు.

ఆయన ఆనందమే మన ఆనందం, ఆయన్ని వివాహం చేసుకో
మని లక్షసార్లు చెప్పాను.

భిక్షా : నేనుకూడా సెప్పినానుబాబు,

పరం : ఇహనేం! ఆయన అభిప్రాయం గ్రహించే వుంటావ్!

భిక్షా : (తేరిపార చూస్తాడు)

పరం : ఆయనకు నీ కూతురి మీద వుందయ్యా!

భిక్షా : మా తులసి మీదా?

పరం : అవును భిక్షాలూ! కుబేరుడే తనంతటతాను నీ గుడెసెకు వియ్య
మందడానికి వస్తున్నాడయ్యా.

భిక్షా : వొద్దు బాబూ వొద్దు.

పరం : కాళ్ళదగ్గరకు సిరొస్తూంటే తన్నుకుంటావటయ్యా?

భిక్షా : అదికాదు బాబూ!

పరం : ఏది కాదు? నా మాటవిను: మేం లక్షమందిమి లక్షసార్లు
చెప్పినా వినని మారాజు, తనంతట తాను నిన్ను అర్థిస్తున్నా
డంటే అది నీ పూర్వజన్మ సుకృతం కాదా?

భిక్షా : ఏ జలమ సుకురుతవో', ఆ పన్మటుకు నే సెయ్యలేను.

పరం : ఎమో?

భిక్షా : కుఱ్రదాని మనసు నాకు తెలుసుబాబూ!

పరం : ఒప్పుకోదా?

భిక్షా : [తల అడ్డంగా తిప్పాడు]

పరం : పిచ్చివాడా! ఆడపిల్ల నాకీమనిషి కావాలి, ఆ మనిషి అఖ్ఖర్లేదు

అని చెప్తుందటయ్యా ఎక్కడన్నా? అదీ గాక కోట్ల కొద్దీ ఆస్తి, వేనకువేలు నౌఖర్లు.

భిక్షా : అదే వొక దాసీది బాబుగారూ!

పరం : పట్టమహిషి అవుతుందయ్యా!

భిక్షా : బరించనేం బాబూ!

పరం : అలవాటై పోతుందయ్యా!

భిక్షా ; ఒద్దుబాబూ! దాని పెళ్ళి అప్పుడే నిశ్చయమైపోయింది.

పరం : ఎవరితో?

భిక్షా : బూసనం బాబుతో.

పరం : ఎవరితో?

భిక్షా : బూసనం బాబుతో బాబు.

పరం : ఆ కూలివాడితోనా? ఆ దరిద్రుడితోనా ?

భిక్షా : ఎవరన్నా తప్పదు బాబూ;

పరం : నీకేవఁన్నా మతివుందాంట, మిల్లులోనూ, ఫ్యాక్టరీలలోనూ అల్లర్లు రేపే ఆ మొనగాడు రేపో ఎల్లుండో తిరిగి రాకండా జైలు పాలవుతాడు. అండమాన్లకి పంపించేస్తారు. అలాంటి వాడికి ఆ పిల్లనిస్తే, ఆమె భవిష్యత్తు ఏమన్నా ఆలోచించావా?

భిక్షా : ఎవర్రాతెలా వుందో యెవరు చెప్పగల్రు బాబూ?

పరం : అందుకని ముక్కుపచ్చలారని పిల్లని తీసికెళ్లి వాడి కంటగట్టి తర్వాత బ్రతుకు బ్రతుకంతా నీ మీద పడి ఏడవడానికా? నే నెందుకు చెప్తున్నానో సరిగా అర్థం చేసుకో భిక్షాలూ!

తుల : [వస్తుంది] పేరయ్యగారేవో పెళ్ళిసంబంధం తెచ్చినట్టున్నారు?

పరం : మీ నాన్నకు ఆ మాత్రం యింగితం లేకపోయినా నాకుంది. ప్రపంచంలో ఏ ఒక్కరికి అన్యాయం జరిగినా చూసి సహించ లేని వాణ్ణి గాబట్టే, నాకుఉచితమని తోచిన సలహా చెబుతున్నాను.

తుల : అంత జాలి ఎందుకో తమరికి మామీద?

పరం : మనిషిని గాబట్టి.

తుల : అయితే తమ పెద్దమ్మాయినే కోటీశ్వరయ్యగారికి ఎందుకివ్వ కూడదు?

భిక్షా : అమ్మా !

తుల : నువ్వూరుకో నాన్నా! ఏవండీ మాట్లాడరు? మీ పెద్దమ్మాయినే వారికిస్తే ఆ కోట్లూ కోట్లూ మీకే దక్కుతాయిగా?

భిక్షా : అమ్మా! ఇక్కడ నేనో పెద్దోణ్ణి వున్నానమ్మ!

తుల : నీ పెద్దరికం ఈ గుడిసెలోనే నాన్నా—లోకం మీదకాదు. పెద్దరి కానికి కూడా హద్దులున్నాయి. పేరయ్యగారు మరి ఎవరిచ్చిన పెద్దరికంతో మనకీ సంబంధం తీసుకొచ్చారో!

పరం : అందరి సుఖం కోరేవాణ్ణి గనుక సలహా చెప్పాను.

తుల : మీ సలహాకు మా కృతజ్ఞత. కలలోనైనా ఇలాంటి 'మంచిపని' చెయ్యకండి. వెళ్ళండి.

పరం : నిజమే మంచికి రోజులుకావు.

భిక్షా : తమరు కూచోండి బాబయ్యా.

భూ : (వచ్చాడు. వాతావరణం అర్థంకాదు.)

పరం : ఒప్పుకుంటావా అయితే ?

భూ : ( దగ్గాడు, )

పరం : ( భూషణ్‌ని చూసి హడలిపోయాడు. ) మళ్ళీను వెళ్ళొస్తాను (పోయాడు;)

భూ : రాయబారానికి వచ్చాడా?

తుల : కాదు పెళ్ళి సంబంధం తెచ్చాడు.

భూ : ఎవరికి?

తుల : నాకే!

భూ : ఎవర్తో ?

భిక్ష : అదికాదు బాబూ....

తుల : నేను చెప్తాలే నాన్నా....కోటీశ్వరయ్యగార్తో నాకు!

భూ : ఓహో! ఒప్పుకున్నారా?

తుల : ఆలోచిస్తున్నాడు నాన్న!

భూ : అవును. ధనం మూలం....

తుల : భూషణ్.

భూ : నీ అభిప్రాయ మేవిఁటి?

తుల : యథా ప్రకారమే.

[భూషణ్ కుర్చీలో కూలబడతాడు. తులసి దగ్గరిగా వెడుతుంది. 'భూషణ్' అనుకుంటూ. భూషణ్ ఆమెను పరిశీలనగా చూస్తాడు. 'నిన్ను నేను సుఖపెట్టలేను తులసీ' అంటాడు. భిక్షాలు నిష్క్రమిస్తాడు బరువుగా,]

భూ : నాకో యిల్లనేది లేదు, తల్లీ, తండ్రీ ముందూ, వెనకా ఎవరూ లేరు, నేను ఒక్కణ్ణిపోతే నా కోసం కంటె తడి బెట్టే ఆత్మ

యులు లేరు. నాకు బ్యాంక్ ఎకౌంట్ లేదు. చేతిలో చిల్లిగవ్వ లేదు.

తుల : అవేం నాకవసరం లేదు. మీరుకావాలి.

భూ : నేనొక దరిద్రుణ్ణి తులసీ, కోటీశ్వరయ్యంతటివాడు నిన్ను చేసుకోవాలనుకుంటే అది నీ అదృష్టమని చెప్పాలి.

తుల : ఆయన్నన్ను చేసుకోరు. కావాలంటున్నారు. నేను నైతికంగా దిగజారిపోవాలి. అది భూషణ్ వాళ్ళకి కావలసింది, నన్ను అర్ధాంగిగాకాదు ఆయన వాంఛించేది; ఉంపుడు కత్తెగా.

భూ : తులసీ!

తుల : అవును భూషణ్! ఎరచూపించి గాలాన్ని మింగమంటున్నారు. అందుకే ఈ పరంధామయ్య రాయబారాలు. నా మనస్సు కాదు వాళ్ళకి కావలసింది: నా దేహం! లేకపోతే ఒకదాసీదాన్ని, కేవలం ఒక దాసీదాన్ని — నన్ను పెళ్ళి చేసుకునేందుకు ఆయన రాయబారాలు చేస్తున్నాడంటే ఏమనుకోవాలి? మనకీ వాళ్ళకీ లక్షయోజనాల దూరం. అఖాతం. ఈ సంబంధానికి ఎలా చెయ్యి చాస్తారని నమ్మావ్ భూషణ్ నువ్వు?

భూ : అదికాదు తులసీ! నీ మనస్సు తెలీకకాదు నేనలా అన్నది. ఏదో భయం! నానించి దూరమై పోతావేమోనన్న బాధ.

తుల : అలా ఎలా అనుకోగలిగావ్ భూషణ్? ఈ నాస్థితికి నువ్వుకారణం కాదా? నే నెక్కడుండేదాన్ని? నాకు చదువు నేర్పించావ్; మనుషుల్ని గుర్తించగలిగే ఇంగితాన్ని ప్రసాదించావ్, నాలో సంస్కారాన్ని కలిగించావ్! ఇది నువ్వు వెలిగించిన దీపం భూషణం. అలాంటిది కృతజ్ఞత మరచి ఎలా నిన్ను వదిలి పెట్టుకుంటాను భూషణ్ ?

ఘా : (ఆనందంతో కళ్ళు మెరుస్తాయి) తులసీ.... నడు తులసీ వెళ్ళిపోదాం, దూరంగా వెళ్లిపోదాం.

తుల : ఎక్కడికి?

ఘా : ఈ కుళ్లు మనుషులు చేతులు చాచలేని చోటుకి.

తుల : ఇక్కడ నీ ఉద్యమం మాట?

ఘా : (నిరాశా, నిస్పృహలతో కూలబడతాడు.)

చుర : వద్దు ఘాషణ్. అంత నిరాశవద్దు. మన స్వార్థం కోసం ఉద్యమాన్ని బలిపెట్టొద్దు.

ఘా : నా కంతా అగమ్యగోచరంగా వుంది.

తుల : ఆ నీరసమే వద్దు. లే ఘాషణ్. నేనున్నాను. నన్నుకూడా ప్రయత్నించనియ్. నాకూ ఒక అవకాశం ఇవ్వు.

[ఈ మాటల్లో ఘాషణ్ కళ్ళల్లో కృతజ్ఞతాభావం మెరుస్తుంది. ఆమె రెండు చేతులూ పట్టుకుంటాడు. ఆమె అభయమిచ్చేట్టు చూస్తుంది. ఘాషణ్‌కి ఏదో ఆశకనిపిస్తుంది. తర్వాత ఘాషణ్ బయటకు నిష్క్రమిస్తాడు. తులసి కాసేపు సాలోచనగా అతను వెళ్ళినవేపే చూస్తూ నిలబడి బయటకు నిష్క్రమిస్తుంది.]

[శాస్త్రజ్ఞుడు యింతకుముందెప్పుడో ప్రవేశించాడు. క్షణం మాట్లాడకండా వాళ్ళిద్దర్నీ చూస్తాడు? వాళ్ళు దాదాపు ఆలింగనం చేసుకునే స్థితిలో వుండగా శాస్త్రజ్ఞుడు వ్యాఖ్యానం మొదలు పెట్టాడు ]

శా : క్షమించాలి. మంచి రసఘట్టంలో అడ్డొచ్చాను. ఇక్కడ మీరు చూస్తున్నది స్త్రీ పురుషులనుకాదు: శాంతి, సమరం అనే రెండు విభిన్న దృక్పథాలని. వాటికి వీళ్ళిద్దరూ మానవరూపాలు. ఈ

సమాజాన్ని స్త్రీ పాలించి నియమాలూ కట్టుబాట్లూ తయారుచేస్తే ఎంత బాగుణ్ణు! పురుషుడు ఉద్రేకానికి బానిస. స్త్రీ శాంతమూర్తి. అతని వురకలువేసే ఉద్రేకానికి కళ్ళెం. పురుషునికి వచ్చిపడే ఆవేశానికి ఒక్కొక్కప్పుడు యుక్తాయుక్తాలు తేలీవు. ముందున్నది ముళ్ళదారని తెలిసినా కళ్ళుమూసుకుపోతాయి. స్త్రీ ఆలోచిస్తుంది. ఆమెకు రక్తపాతం, కొట్లాటలు యిష్టముండదు. పురుషుడు యిందుకు సరిగ్గా భిన్నం కాని దురదృష్ట వశాత్తూ సమాజానికి శాసనకర్త పురుషుడే! అందుకే ఈ విప్లవాలూ, రక్తపాతాలూ, స్త్రీ మాతృమయి. శాంత స్వరూపిణి. ఈ సమాజానికి శాసనకర్త స్త్రీ అయితే ఎంత బావుండేది?

(శాస్త్రజ్ఞుడు ఈ వ్యాఖ్యానం చేస్తూ వుండగా మెల్లగా రంగస్థలంమీద దీపాలన్నీ ఆరిపోతాయి. ఆ చీకట్లోనే భూషణ్ తులసి నిష్క్రమించారు. కాని దురదృష్టవశాత్తూ సమాజానికి శాసనకర్త పురుషుడే అని శాస్త్రజ్ఞుడు అన్నప్పటికి రంగం మీద దీపాలు పూర్తిగా ఆరిపోయాయి. తర్వాత శాస్త్రజ్ఞుని రెండు వాక్యాలూ చీకట్లోనే వినిపిస్తాయి.)

o o o

(దీపాలు వెలిగేసరికి రంగస్థలం కోటీశ్వరయ్య యిల్లుగా మారింది. అంటే రంగంమీద నాలుగు కుర్చీలు వుంటాయి.)

శా : మళ్ళీ యిప్పుడు మనం కోటీశ్వరయ్య యింటికి వచ్చాం. ఇప్పుడు యిక్కడొక అగ్నిపర్వతం బ్రద్దలయింది. ఎవరి హృదయాల్లో ఎంత లావావుందో అది నగ్నస్వరూపాల్లో యిప్పుడు ప్రత్యక్షం కాబోతోంది. మనిషి ఎంత మంచివాడుగా కనిపించినా, కొన్ని కొన్ని సందర్భాల్లో, కొన్ని కొన్ని సంఘటనలతో అతని నిజస్వరూపం తెలిసిపోతుంది.

[శాస్త్రజ్ఞుడు: 'మళ్ళీ యిప్పుడు మనం కోటీశ్వరయ్య యింటికి వద్దాం' అనీ అనగానే బయటనించి లాయర్, కోటీశ్వరయ్య గబ గబ వస్తారు. శాస్త్రజ్ఞుడు వ్యాఖ్యానంచేస్తూ వుండగానే లాయర్, కోటీశ్వరయ్య ఏదోసమస్యను తీవ్రంగా చర్చించేసుకుంటూ వుంటారు. అంటే వీళ్ళ మూకాభినయనానికిశాస్త్రజ్ఞుడు వ్యాఖ్యానం చేస్తూనైనా వుండొచ్చు. లేదా శాస్త్రజ్ఞుడి వ్యాఖ్యానానికి అనుగుణంగా వాళ్లు అభినయిస్తూ వుండొచ్చు. వాళ్లిద్దరికీ వాగ్యుద్ధాలు, వాదనలు సమస్యలపరిష్కారాన్వేషణకు తలలు బద్దలు గొట్టుకుంటారు. శాస్త్రజ్ఞుడు వ్యాఖ్యానం పూర్తయాక యిద్దరూ చప్పున గొడవగా మాట్లాడారు, శాస్త్రజ్ఞుడు కాసేపు అయాక నిష్క్రమిస్తాడు]

లా : నేను చెప్పేదీ అదేనండి.

కోటీ : వెంటనే నోటీసులు పంపించేసెయ్యండి.

లా : మరో రెండు దినాలు చూదాం. రాజీకి రాకపోతే మిల్లు మూసెయ్యడం ఎలానూ తప్పదనుకోండి,

కోటీ : ఇది నా డబ్బు, నా సొంతం. నా దయా దాక్షిణ్యాలమీద బతకవలసిన వీళ్ళు నన్నెదిరించి నా దగ్గర్నుంచి ఏం సాధించగలరో చూస్తాను!

లా : అవును. అదా వెధవలకి తెలిస్తేగా? అసలు విషయం ఏవిటంటే కోటీశ్వరయ్యగారూ, రౌతు మంచివాడయితే గుర్రం కుంటుతుందట, ఇన్నాళ్లూ మీరు చూసీ చూడనట్టు, పోనీలే పేద వెధవలు, అని వూరుకుంటున్నారుగా — అది మీ చేతకాని తనం కింద లెఖ్ఖగట్టి యిష్టమొచ్చినట్లు ఆడుస్తున్నారు.

కోటీ : అరుస్తారు, అరుస్తారు, నాట్రోజులు వెధవలకి దొక్కలు మాడితే— ఆ అరవడ మేవిఁటో తెలిసొస్తుంది,

లా : ఇదివిన్నారా కొత్త వాదం? వాళ్ళకికావలసింది బోనస్‌లే కాదట. మీ మిల్లులూ, ఫ్యాక్టరీలూ, భూములూ అన్నీ తమ అధీనంలోకి తీసుకుని వాళ్ళే నడుపుతారట? ఏ సెక్షన్ ప్రకారం ఆ వెధవల లాంటి గొంతెమ్మ కోర్కెలు కోరుతున్నారో అర్థంగావటం లేదు.

కోటీ : అదేదో సోషలజవఁట—దాని ప్రకారవఁట!

లా : కాని ఈ సమాజంలోయింకా ఓన్యాయస్థానమంటూ వోటుంది.

కోటీ : దాన్నికూడా యిప్పుడు రద్దు చెయ్యమంటున్నారుగా!

లా : ఆఁ ఆఁ! ఈ వెధవలు రద్దుచెయ్యమంటే చేసేస్తార్లా వుంది. కోటీశ్వరయ్యగారూ: మీరెందుకు? మీరలా వుండండి. నేను పరిస్థితుల్ని చక్కబెట్టుకుంటాను.

పరం : (వస్తాడు) నమస్కారాలండీ! నమస్కారాలు.

కోటీ : ఇదో పానకంలో పుడక. తలల్లో తల, తోకల్లో తోక! ఎటుంటాడో అర్థంకాదు.

పరం : అమ్మమ్మ ఎంతమాట శలవిచ్చారు! ఈ పరంధామయ్యను అంతవరకే అర్థం చేసుకున్నారన్నమాట! ప్రాణం పోయినా స్వామిభక్తి మాత్రం పోదువీడికి.

లా : ఇంతకూ ఎక్కణ్ణుంచి రావడం తమరు?

పరం : మిల్లు దగ్గర్నుంచే!

కోటీ : కొత్త విషయాలేవన్నా సేకరించావా?

పరం : అమ్మమ్మ! సేకరించడానికే కదండి ఈ సేవకుడు! మిల్లుదగ్గర్నుంచి అలా ఆ వర్కర్ల యూనియన్ దగ్గరకుకూడా వెళ్లాను.

లా : స్ట్రయిక్ నోటీసు ఉపసంహరించు కుంటున్నారా వాళ్లు?

పరం : చచ్చినా! తాడో పేడో అంటున్నారు.

కోటీ : కొండల్తో పోట్లాట!

పరం : ఆ విషయం వాళ్ళకి తెలిసేడిస్తే కదండీ?

లా : తమరేం వాళ్ళకి నచ్చ చెప్పలేదా?

పరం : చంపేశారు? నచ్చచెప్పేవరకూ రానిచ్చారావాళ్ళు? ఇలా రోడ్డు మీద కనిపించానో లేదో వానర మూకలా మీద పడ్డారంటే నమ్మండి: తన్నండంటే కొట్టండంటూ- ఇలా కన్నులొట్టబోయి బతికి బయటపడ్డాను.

కోటీ : గొప్పపని చేశారు!

పరం : చిత్తం! అదైనా చెయ్యగలిగాను. కాని ఒక విషయం బాబుగారూ! కిలెరిగి వాతెట్టమన్నారు మనవాళ్ళు! దీనంతటికి వెన్నెముక ఒకటుంది! దాన్ని నిర్దాక్షిణ్యంగా విరిచేస్తేనేగాని మనకి విజయం చేకూరదు.

కోటీ : భూషణం మాటేనా నువ్వనేది?

పరం : చిత్తం!

కోటీ : కానీ వాణ్ణి ఉద్యోగంలోనించి తీసేస్తే మహో సమస్య వృద్ధవుతుందయ్యా!

లా : ఏపీ( ఎత్తదు; అన్‌రూలీ బిహేవియర్ (Unruly Behaviour ఇన్ సైట్‌మెంట్ టు స్ట్రయిక్ (incitement to Strike) అని రెండుమూడుసార్లు ఛార్జిషీట్లుయిచ్చి అఖర్నవూడదీసేస్తేసరి!

కోటీ : కాని అతను మిల్లులో ఏ తప్పూ చెయ్యదే!

పరం : అక్కడే మన తలలు వుపయోగించాలి బాబుగారూ! ఆకిటుకు నే చెప్తాను.

లా ; కిటుకులు తర్వాతచెప్పుదుగాని లేవయ్యా-ముందిది ఏంచెయ్యాలో ఆలోచించండి_ అప్పుడే పీకలవరకూ వచ్చికూచుంది.

పరం : ఏం లేదు. వో యేడాది బోనస్‌లు వాళ్ళ మొహం మీద పడేస్తే సరి.

కోటీ ; వీల్లేదు.

పరం : చిత్రం! మరోలా నరుక్కొద్దా మంటున్నాను. ఒక యేడాది బోనస్‌లు విసిరేస్తా మనుకోండి. కొందరికిలాలూచీ యెక్కువవు తుంది. పదిమందిఅయినా పనుల్లోకివస్తారు. మనచేతుల్లోఏలానూ పది దిన, వార, మాసపత్రికలు వుండనే వున్నాయ్. వాటిల్లో ప్రచారం మొదలెడదాం. మిల్లు మళ్ళానడుస్తూందని! దాంతో మరికొందరు హడలెత్తి వచ్చేస్తారు. ఇక మిగిలినవాళ్ళను వూడ బెరికేస్తామని నోటీసులు పంపిద్దాం. దాంతో తొంభై తొమ్మిది వంతుల జనాభా వచ్చేస్తుంది. ఎంతయినా గొర్రెలమందకదండీ మనుషులంటే.

లా : నువ్వు చెప్పినంత తేలిగ్గా అవుతుందా?

పరం : ఎందుకవదు? ముందా యేడాది బోనసు మీద కాదనుకుని వాళ్ళ మొహంమీద పారెయ్యండి. తర్వాతపని నేను చూసుకుంటాను.

కోటీ : వీల్లేదు నే నలాంటి రాజీకిరాను. ఇది నా డబ్బు! నా ఆస్థి.

పరం : కాదని ఎవరన్నారు బాబుగారూ! దేనికైనా పట్టూవిడుపూ కావాలి.

కోటీ : సలహాలనవసరం. ఆ మిల్లులన్నీ ఏ పరాయివాడికో అమ్మేసి నా మానాన నేను పోతాను. అక్కడితో వాళ్ళరోగం కుదురుతుంది.

పరం : అయితే యీ ఎలక వెధవలకి భయపడి మీరు వెళ్ళిపోతారా?

లా : నొ నొ నొ : కోటీశ్వరయ్యగారూ: మేమంతా వుండగా మీర లాంటి నిర్ణయానికి వచ్చేకూడదు, ఈ కాగితాలమీద ఓ సంతకం పారెయ్యండి. తర్వాత పన్నేను చూసుకుంటాను.

పరం : వ్యాఘ్రేశ్వరంగారు కాగితాల్తో మిల్లుపని చూసుకుంటారు. నేను కాలిగోటితో ఆ భూషణ్‌గాడి పనిపడ్తాను. కానివ్వండి.

[కోటీశ్వరయ్యకు చెరో పేషనా నిలబడ్డారు. సంతకం పెట్టడానికి కాసేపు ఆలోచించాడు కోటీశ్వరయ్య. తర్వాత Imaginary కాగితాల మీద పరంధామయ్య తీసి ఇచ్చిన Imaginary పెన్‌తో సంతకం పెట్టేస్తాడు]

లా : దట్సాల్: ఇహ మీరు నిశ్చింతగా వుండండి. మిల్లుదగ్గర ఏ వెధవన్నా ఉఁ' అన్నాడంటే చాలు వాడికిక శ్రీకృష్ణజన్మస్థానమే. (పోతాడు) వస్తానండి.

కోటీ : ఆఁ: ఏవిఁటయ్యా. పరంధామయ్యా: అరచేతిలో వైకుంఠం చూపిస్తూ నన్నే పల్టీలు కొట్టిస్తున్నావ్

పరం ; దేనిగురించి బాబుగారూ?

కోటీ : 'దేనిగురించీ?' అని అడగడం వరకూ వచ్చిందీ?

పరం : ఏమిటిచెప్మా? ఓహో: (నవ్వేస్తాడు) ఆఁ, ఆ: జ్ఞాపకముంది. మొన్న భీకాలు యింటికి వెళ్లాను.

కోటీ : ఎందుకు?

పరం : అదే....తులసి.... (ట్రాప్ చెయ్యాలి అన్నట్టు పిడికిలి బిగిస్తాడు)

కోటీ : తులసా?....ఆఁ ఆఁ....ఏమంది? ఒప్పుకుందా?

పరం : ఒప్పుకోక యేం చేస్తుందండి? మనం వొప్పించి దారికి తీసుకు రావడంలో వుంది ప్రజ్ఞ అంతా! అయితే మీరొక చిన్న నాటక మాడాలి!

కోటీ : ఏవిఁటది?

పరం : ఏం లేదూ—మీ ఆస్తిలో సగంవాటా ఆమెకు రాసియివ్వాలి.

కోటీ : ఏడ్చినట్టుంది. వెధవ రాజీ బేరాలూ నువ్వూను. అక్కడా వెధవ లకి బోనసు లివ్వమంటావ్. ఇదెవర్తో ముష్టిదానికి—

పరం : నన్నుసరిగా తమసర్ధం చేసుకోలేక పోతున్నారు. రాయడమంటే నిజంగా రాస్తామటండీ? రాసినట్టు నటించాలి.

కోటీ : అది తర్వాత పీకకు చుట్టుకుంటే?

పరం : అలాంటివన్నీ చూసుకోడానికి లాయరు వ్యాఘ్రేశ్వరంగారు వుండనే వున్నారు గదండీ?

కోటీ : ఈ విషయం ఆ భిక్షాలుగాడితో చెప్పావేవిఁటి?

పరం : వేస్తే కోట్లోనే వెయ్యాలి పాగా!

కోటీ : గొప్పపనిచేశావ్! అతనివరకూ ఎందు కెళ్ళనిచ్చావయ్యా?

పరం : అక్కడే వుందికిటుకు బాబుగారూ. మీకీ తక్కువజాతి వాళ్ళ మనస్త త్వాలు సరిగ్గా తెలీవు. డబ్బు ఆశచూపిస్తే యెంతటి కక్కుర్తికైనా దిగజారిపోతారు.

కోటీ : సర్లే! నీ నిర్వచనాలకేం. వీలయినంతవరకూ నన్ను మధ్యకు ఈడ్చకు. ఇది నీసొంత ప్రతిపాదనగానే వాళ్ళతో చెప్తూవుండు.

(ఇంతలో తులసి వస్తుంది. పడకగదిలోకి వెళుతుంది— తన పనులు చూసుకునేందుకు. పరంధామయ్య సైగచేస్తాడు. కోటీశ్వరయ్య సంకోచిస్తాడు. 'ఫర్వాలేదు వెళ్ళండి' అని పడక గదివరకూ తోస్తాడు. కోటీశ్వరయ్య భయపడుతూవుంటే ఆయన నోట్లో చుట్టలాగేసి లోపలికి తోసేస్తాడు.

ఒకసారి లోపలికి తొంగిచూసి నవ్వుకుని రంగస్థలం మధ్యకు బాగా ముందుకి వస్తాడు. చేతిలో ఉన్న చుట్ట జ్ఞాపకానికి వచ్చి అసహ్యించుకుని ఆ Imaginary చుట్టని కిందికి విసిరి కొడతాడు. నిట్టూర్పు విడుస్తాడు. ముఖంలో బాధ, నిస్పృహాయత! వొకసారి పైకి ఆకాశంలోకిచూసి తప్పదు భగవంతుడా! తప్పదు! నేను బతకాలి. క్షమించు" అని గబ గబ బయటకువెళ్ళి పోతాడు. అతను వెళ్ళిపోవడం, పడక గదిలోనుంచి తులసి రయ్యిన రావడం వొకేసారి జరిగాయి. ఆమె వెనకాలే కోటీశ్వరయ్య వస్తాడు)

తుల : బాబుగారూ! నేను మీ కూతురితో సమానం. అలాంటప్పుడు తమరిలాంటి అనుచితమయిన కోర్కెకోరడం భావ్యమా?

కోటీ : అనుచితమేముంది తులసీ! నిన్ను .... భా .... భార్యగా స్వీకరిస్తాను.

తుల : బాబుగారూ! ఆ భోగభాగ్యాలు నాకవసరంలేదు. మీరివ్వబోయే ఆ సర్వస్వంలో నాకు యిసుక రేణువుకూడా వద్దు.

కోటీ : నేను యజమానినని మర్చిపోవద్దు.

తుల : మాకూ వో వ్యక్తిత్వముందనితమరూమర్చిపోకండి బాబుగారూ!

కోటీ : బురదపందులు మీరు—మీకో వ్యక్తిత్వం, నియమం!

తుల ; బాబుగారూ!

కోటీ : నోర్మూయ్! నేను తలుచుకుంటే ఏం చేసెయ్యగలనో తెలుసా?
(వచ్చి చెయ్యిపట్టుకున్నాడు)

తుల : విడిచి పెట్టండి—ఒదలండి.

కోటీ : ఇంతవరకూ వచ్చాక నేను విడిచి పెడతాననేది కలలో మాట!

(దగ్గరకు లాక్కుంటాడు. పెనుగులాట. గొడవ విని భూషణ్ వచ్చాడు)

భూ : కోటీశ్వరయ్యగారూ! (విడదీశాడు)

కో : నువ్విక్కడికి కెందుకొచ్చావ్? ....ఒరే భిక్షాలూ.... గంగులూ? పరంధామయ్యా....

భూ : పిలవండి. అందర్నీ పిలవండి. మీ నీచత్వం ఇక్కడే యిప్పుడే బయటపడుతుంది.

కో : స్కౌండ్రల్!

భూ ; ఆగండి అక్కడే! లేకపోతే నేనూ చెయ్యి చేసుకోవాల్సి వస్తుంది.

కో : చెయ్యి చేసుకుంటావా?

తుల : భూషణ్!

(కోటీశ్వరయ్య భూషణ్ మీది కురికాడు. తులసి అడ్డం పడితే ఆమెను ప్రక్కకి లాగేశాడు. భూషణ్ మీదపడి కొట్టాడు. భూషణ్ వొరిగిపోయాడు. తులసి కింద పడిపోయిన భూషణ్ మీద 'భూషణ్' అంటూ పడియేడ్చింది. బయటనించి డాక్టర్, లాయర్, పరంధామయ్య, లోపలినుంచి భిక్షాలు రావడంతో— తులసి చెయ్యిపట్టుకుని బలవంతం చేయబోతున్న కోటీశ్వరయ్య ఆమె చెయ్యివిడిచి అందర్నీ ఆశ్చర్యంగా చూశాడు. తులసి, భిక్షాలు వెనక్కిపోయి ఏడ్చింది)

భిక్ష : ఏంటి? ఏవయింది—ఏవయింది బాబుగారూ?

(సమాధానం యివ్వడు కోటీశ్వరయ్య. అందరి ముఖాల్లోకి ఒకసారిచూసి గప్పున Imaginary Telephone దగ్గరకు వెళ్ళి Dial చేస్తాడు)

కో : హలో! పోలీస్ స్టేషన్? నేను కోటీశ్వరయ్యను మాట్లాడుతున్నాను. ఎస్. ఎస్. ఇక్కడ వొకడు నాయింట్లో దోపిడీ చెయ్యడానికి వచ్చి నన్ను ఖూనీ చెయ్యబోయాడు ...

('నేను కోటీశ్వరయ్యను మాట్లాడుతున్నాను' అన్నప్పటి నుంచీ రంగస్థలంమీది దీపాలు డిమ్మర్ మీద మెల్లగా కాంతిని కోల్పోయి—చివరికి చీకటి)

ం ం ం

[మళ్ళా దీపాలు క్రమంగా డిమ్మర్‌మీద వెలిగేసరికి అది కోర్టు. ఇప్పుడు మధ్యగా ఒకకుర్చీమాత్రమే వుంది. కుడివేపున కోటీశ్వరయ్య, డాక్టరు. లాయరు నిలబకితీవ్రంగా ఏదోచర్చించు కుంటూ వుంటారు: వాళ్ళకి ఎడంగా ఫుట్‌లైట్స్ దగ్గర భిక్షాలు మోకాళ్ళలో తలపెట్టుకుని వుంటాడు. నిద్రో, యోగముద్రో తెలీదు. అతని ప్రక్కనే తులసి నిలబడి వుంటుంది. పరంధామయ్య వీళ్ళ దగ్గరనుంచి కోటీశ్వరయ్య గ్రూప్ దగ్గరకూ, అక్కడనుంచి వీళ్ళదగ్గరకూ తిరిగి వస్తూవుంటాడు. క్షణం తర్వాత కోర్టు బంట్రోతులా మెడలో పటకా (Imaginary) సర్దుకుంటూ Imaginary కర్ర కింద కొడుతూ)

పరం : సైలెన్స్! నిశ్శబ్దం మహా మేధావులు, విద్యాధికులు, నిష్పాక్షిక దృష్టికలవారు, గౌరవనీయులయిన న్యాయాధికారులు వేంచేస్తున్నా రహో హో హో హో!

[గుస గుసలు ఆగాయి. ఎటన్షన్‌లో నిలబడ్డారు. తులసి కన్నీళ్ళు తుడుచుకుని పైట భుజం చుట్టూ తిప్పుకుంది. శాస్త్రజ్ఞుడే న్యాయాధికారి. వచ్చి కుర్చీలో కూర్చున్నాడు]

పరం : సైలెన్సు! నిశ్శబ్దం.

శా : కోటీశ్వరయ్యగారిమీద హత్యాప్రయత్నానికిసంబంధించినకేసు. ముద్దాయిని ప్రవేశ పెట్టండి.

పరం : అలజళ్ళ భూషణ్‌రావ్! అలజళ్ళ భూషణ్‌రావ్! అలజళ్ళ భూషణ్‌రావ్!

(పరంధామయ్యే వెళ్ళి, భూషణ్‌ని తీసుకొచ్చి Imaginary hand cuffs విప్పాడు. లాయరు వ్యాఘ్రేశ్వరం కోటు సర్దుకుని ముందుకి వచ్చాడు)

లా : యువర్ ఎక్సలెన్సీ! యువర్ లార్డ్‌షిప్: యువరానర్! మీ యెదురుగా ముఖం కిందికి దించుకుని ఉన్న ఆ మనిషిని చూడండి. ఎంత శాంతమూర్తిలా, ఎంత అమాయక ప్రాణిలా, ఎంతజాలి పుట్టించే విధంగా నిలబడి వున్నాడో! ఈమనిషిలో నిజానికి వొక కూౄరాతి క్రూరమయిన రాక్షసుడు, శిలాహృదయుడయిన కసాయివాడు వున్నాడు. ఇతను సమాజంలో అలజడిని కలిగించి విప్లవాలూ, అంతర్యుద్ధాలూ, రక్తపాతాలూ, మారణ హోమాలూ పుట్టించాలని ప్రయత్నాలు చేస్తునాడు. ఆ ప్రయత్నాలేవిఁటో సాక్షుల సాక్ష్యాలవల్ల విశదమయింది. నంబరు వన్; ఆకలి అనేదాన్ని వొక సమస్యగా ప్రచారం చేస్తున్నాడు. దేవుడిచ్చిన దాహాన్ని దేవుడి తప్పుకాదంటున్నాడు. నదిలోని నీళ్ళని ప్రజలకందించలేని ప్రభుత్వానిది అంటున్నాడు మనది సత్సాంప్రదాయాలు కల నవనాగరిక సమాజం. దాని మానాన అది పోతూ వుంది. అలాంటి అమాయక సమాజంలో ఉత్తేజమనే పేరుతో

విషాన్ని చల్లి ఉద్రేక పరుస్తున్నాడు. దీని వలన సమాజం యొక్క సున్నితమయిన పోకడ సర్వనాశనం అయిపోతుందన డానికి యెటువంటి సందేహమూలేదు. ప్రతిమనిషి, ప్రతివ్యక్తి సమాజంలో, దేశంలో, ఒక ప్రదేశంలో శాంతి సౌభాగ్యాతో జీవితాన్ని గడుపుకోవాలని చూస్తాడు అటువంటి పవిత్రాశలయా లకూ, ఆశలకూ యితను అడ్డు తగిలి నిత్యజీవితంలో ఒక అల జడిని, అంతః కలహాన్ని కలిగిస్తున్నాడు. డాక్టరుగారు ఈ మనిషి రక్తాన్ని పరీక్షించారు ఇతని వంశాన్ని పరీక్షించారు ఇతని పూర్వీకుల్నీ, హార్మోనుల్నీ, క్రోమోజోముల్నీ పరిశోధించారు. వారి పరీక్షల వల్ల తేలిన నగ్నసత్యం ఏవిఁటి? 'హత్యలు చేయ డం; విప్లవాలు లేవదీయడం' ఇతని రక్తంలోనే జీర్ణించుకుని వున్న పుట్టుకబుద్ధి అని! నాగరిక సమాజం. అటువంటి హంతకుణ్ణి అలజడి మనిషిని సహించగలదా? యువర్ ఎక్సలెన్సీ యువర్ లార్డుషిప్, యువర్ అనర్! అటువంటి దుర్నడతగల ఈ దుర్మా ర్గుడు సంఘంలో పేరు ప్రతిష్ఠలు గలిగి, వెయ్యికోట్ల స్థిరచరాస్తి గలిగి, పది మందికి ఇంత అన్నదానం చేస్తూ వున్న మహాదాతా, కోటీశ్వరుడూ, కోమల హృదయం కలవాడూ, శాంతస్వభావుడూ సాధుశీలీ, జ్ఞానశీలీ అయిన శ్రీమాన్ కోటీశ్వరయ్యగారిని ద్రైహి కంగా చంపెయ్యడానికి పూనుకున్నాడు. గమనించండి యువర్ ఎక్సలెన్సీ! యువర్ లార్డుషిప్! యువరానర్! కోటీశ్వరయ్య గారు తనని బలవంతం చేయబోయారని ముద్దాయితరపున ఈ స్త్రీ సాక్ష్యం: ఎందుకు చేయబోయారో తనకి తెలీదట! సంస్కార వంతులూ, దయానిధీ, విశాల హృదయులూ, విద్యానిధీ అయిన కోటీశ్వరయ్యగారు కేవలం-తన యింట్లోపని చేసే దాసీదానిమీద చదువూ సంస్కారం లేని ఒకతక్కువ జాతి, నాసిరకం, నికృష్ట

కులం స్త్రీని బలవంతం చేయబోయారట! సభ్య ప్రపంచం దీన్ని నమ్మగలదా. పోగా, అంత రాత్రప్పుడు ఆమె ఆయన గదిలోకి యెందుకు వెళ్లినట్టు? బలవంతం చేయించుకోడానికా? మరో విషయం! అంతరాత్రప్పుడు ముద్దాయి కోటీశ్వరయ్య యింట్లో ఎలా ప్రత్యక్షమయ్యాడు? తన ప్రియురాలయిన తులసి అనే స్త్రీని యెవరో బలవంతం చేస్తున్నపుడు ఆమె ఆక్రందనల్ని విని ముద్దాయి పరుగెత్తుకుని వచ్చాడా? ఇదంతా ముద్దాయి కల్పించిన అభూత కల్పన, అబద్ధాల కథ అని కోర్టువారికి మనవి చేసుకుంటున్నాను. పైగా కోటీశ్వరయ్యగారిని హత్యచెయ్యడానికి ఉపయోగించినకత్తి తనది కాదంటున్నాడు ముద్దాయి. కోటీశ్వరయ్యగారిదే అని ఆరోపిస్తున్నాడు. యువర్ ఎక్సలెన్సీ, యువర్ లార్డుషిప్, యువర్ ఆనర్: ఇక్కడ తమరా నగ్న సత్యాన్ని గుర్తించ వలసిందని కోరుతున్నాను. కోటీశ్వరయ్యగారంతటి కోటీశ్వరులు ఒక మనిషిని చంపడానికి తనదగ్గరకత్తుల్నీ గొడ్డళ్ళనీ వుంచుకోవాల్సిన అవసరంలేదు, వాళ్ళదగ్గర ఆటంబాంబులు, హైడ్రోజన్ బాంబులుండగా నాటు కత్తులా వారిక్కావలసింది. కత్తులు, సుత్తులు, కొడవళ్ళులాంటి నాటు ఆయుధాలని ఉపయోగించేది ముదాయి లాంటి తక్కువజాతివారే! ఈ వొక్క చిన్న నిజంతో, ముద్దాయిగా నిందింపబడుతున్న ఈ భూషణరావే నిజమయిన హంతకుడని ఋజువవుతోంది. అందువల్ల యువర్ ఎక్సలెన్సీ. మిలార్డ్, యువర్ ఆనర్! ఈ విషయాలన్నీ కూలంకషంగా పరిశీలించి ముద్దాయికి తగిన శిక్ష విధించవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

శా : ముద్దాయి—తనిప్పుడు ఏమన్నా చెప్పుకోదలిస్తే చెప్పుకోవచ్చు.

భూ : (మాట్లాడడు)

శా : నువ్వేం చెప్పుకోవా?

భూ : ఏమిటి చెప్పుకోమంటారు?

శా : నీ మనస్సుని.

భూ : అదేం చెప్పకపోతే?

శా : ఆ చెప్పేదాన్నే రికార్డు చేసుకుంటాం,

భూ : (నవ్వుతాడు)

తుల : భూషణ్!

భూ : (పక పక నవ్వుతాడు)

శా : ఆర్డర్: ఆర్డర్!

[భూషణ్ పక పక నవ్వుతూనే వుంటాడు. అంతా యంత్రాల్లా ఏదేదో మాట్లాడుతూ కోర్టులో యిటూ అటూ తిరుగుతారు. శాస్త్రజ్ఞుడు 'ఆర్డర్ ఆర్డర్' అని అరచినా లాభంలేదు. గోల, నవ్వులు. శాస్త్రజ్ఞుడు కోపంతో కుర్చీనించి లేచిపోయాడు]

శా : ఆర్డర్! ఆర్డర్!

భూ ; (ఠక్కున నవ్వడం ఆపాడు) నేను చెప్పుకోవలసిందంతా చెప్పుకున్నాను. ఇకమీరు శిక్షించుకోవచ్చు.

శా : ఆ పిచ్చినవ్వా నువ్వు చెప్పుకున్న విషయం?

భూ · అవును.

శా : సరే! (Imaginary బుక్ చూసి చదువుతాడు) నువ్వు—హంతకుడుగా ఆరోపించబడిన అలజల్ల భూషణరావు నామధేయుడవయిన నువ్వు—నాగరిక ప్రపంచం హర్షించని పెద్ద తప్పుచేశావ్: ఈ మానవ సమాజానికి మూలంగా సుఖ శాంతులు దూరమవుతున్నాయి. వాటిని భంగ పరిచేందుకు నీ యిష్ట మొచ్చినట్టల్లా

ప్రవర్తించావ్! నీకీ మానవ సమాజంలో వుండే హక్కులేదు. ఇటువంటి ఘోర కృత్యములు చేసెడినీకు ఉరిశిక్ష విధించ వల సిందే! ! కాని, కొద్దికాలం నీకు జైలుశిక్ష విధింపజేస్తే నువ్వు మారవచ్చుననే ఉద్దేశంతో ఏడాది కఠినశిక్ష విధిస్తున్నాను.

[శాస్త్రజ్ఞుడు లేచిపోయాడు. కోర్టులో కలకలం. తులసి ఏడ్చింది. భిక్షాలు మెల్లగా ఆమె దగ్గరకు వచ్చాడు. పరంధా మయ్య భూషణ్ని బయటకు తీసుకుపోయి వెంటనే కోటీశ్వ రయ్య బాబుగారికీ అంటాడు. డాక్టరు, లాయరు జై అంటారు. అలా జయ జయ ధ్వానాలు చేసుకుంటూ వాళ్లు వెళ్ళిపోయారు. తులసి ఏడుస్తూ శాస్త్రజ్ఞుని సమీపిస్తుంది. ఆమె రాపడం చూసి శాస్త్ర జ్ఞుడు మూడుకోతుల్లో కళ్ళుమూసుకున్న కోతిలా, కళ్లు మూసు కుంటాడు.

తుల : బాబుగారూ!

[శాస్త్రజ్ఞుడు యిప్పుడు, రెండో కోతిలా చెవులు మూసు కుంటాడు]

తుల : బాబుగారూ! భూషణ్ ఏ తప్పూ చెయ్యలేదండి. భగవంతుడి సాక్షిగా చెప్తున్నాను. నామాట నమ్మండి!.... మాటాడరేం బాబుగారూ!

[తులసి ఏడ్చింది. శాస్త్రజ్ఞుడు మూడోకోతిలా నోటికి అడ్డంగా చెయ్యిపెట్టుకుని గబగబ అక్కడినుంచి వెళ్లిపోతాడు. తులసి ఏడుస్తూ వుండగా రంగస్థలం మీది దీపాలు మెల్లగా ఆరిపోతాయి]

o o o

(దీపాలు వెలిగే సరికి అది కోటీశ్వరయ్య భవంతి. అంటే

స్టేజీమీద నాలుగు కుర్చీలు వుంటాయి. చీకట్లోనించే నవ్వులు వినిపిస్తాయి. దీపాలు క్రమంగా వెలిగేసరికి కోటీశ్వరయ్య, డాక్టరు, లాయరు Imaginary గ్లాసుల్తో తాగుతూ వుంటారు. వీళ్ళముగ్గురికీ 'పోస్తున్న' పరంధామయ్య చేతిలో Imaginary విస్కీ బాటిల్.)

పరం : (Imaginary బాటిల్‌లోని ద్రవాన్నికోటీశ్వరయ్య Imaginary గ్లాసులో పోస్తూ) మరి కొంచెం.

కోటీ : పోసెయ్. ఎంతపోసినా ఒద్దనం. పొయ్.

డా : ఫారిన్ విస్కీ ఎంత తాగినా శరీరానికి హాని జరగదు. పొయ్.

లా : పొసెయ్ పీపాల్తో. పోలీసులకి భయపడకండి. 'లా' మనకి తెలుసు.

పరం : (అసహ్యించుకుంటూనే అందరి 'గ్లాసులు' నింపాడు) ధర్మ ప్రభువులు, తమరు తాక్కపోతే మరెవరు తాగ్గలరు? తాగండి.

డా & లా : పొయ్! ఇంకా పొయ్!

పరం : పందెం! మా బాబుగారిదగ్గర మీరెవరూ తాగడంలో గెలవలేరు,

డా : అలానేం? సరే! పందెం.

లా : పందెం ఎవరు గెలుస్తారో?

కోటీ : నేనే గెలుస్తాను. పరంధామయ్య భార్యమీద ఒట్టు, పొయ్.

(పరంధామయ్య షాక్ తింటాడు! కసిహెచ్చి ముగ్గురికీ 'పోసేస్తాడు' ముగ్గురూ యంత్రాల్లా 'తాగుతారు'. మళ్ళీ 'పోస్తాడు'. మళ్ళీ 'తాగుతారు. లక్షమైళ్ళ స్పీడ్‌లో ఈ action-repeat అవుతుంది. 'సీసాలు, సీసాలు, ఖాళీ అవుతాయి. కోటీశ్వరయ్య తూలుతూ లేస్తాడు)

కోటీ : ఒక్క నిమిషం, మనకి యిప్పుడో షిణ్ణ వుపన్యాషం యివ్వాలని బుద్ధి పుడుతోంది!

పర : అవశ్యం అవశ్యం! ఎలాగైగా బాబుగారికి మహానాయకుడయే లక్షణాలున్నాయ్. (చప్పట్లు)

కోటీ : బటింపలేణు. ఆపండి. ఆపండి. తమరింతమంది, ఇన్ని విధాలుగా నన్ను బళవంతం చేషి, ప్తోష్షహిస్తూ వుంటే—తప్పదు— నాయకణ్ణి అవుతాణు.

లా : నాయకులా! ఛ, ఛ! మహానాయకులు కావాలి.

డా : హిజ్ ఎక్సెలెన్సీ కోటీశ్వరయ్యగారూ!

డా, పరం : జిందాబాద్!

కోటీ : (ఆపమని చేతులెత్తి) సోదర సోదరీ మణులారా!

బరం : ఇక్కడ సోదరీ మణులెవరూ లేరండి.

లా : పోనీ నువ్వు అందాకా వుందూ!

దరం : (బాధపడతాడు)

డా : బాధపడకు పరంధామీ. ఈ మధ్య చాలామందికి ఓవర్ నైట్ సెక్సు మారిపోతోంది.

లా : హియర్ హియర్,

కోటీ : మీరందరూ నాకిచ్చిచ ఈ సన్మానానికి కృతజ్ఞుణ్ణి. నన్ను నాయకుణ్ణి చెయ్యాళణి మీ అందరూ యింత పట్టుపడ్తే, టప్పక ఒప్పుకుంటాను. కాని జేణక్కడకు వెళ్ళి ఏం చెయ్యాలో మీరంతా షెప్తూవుండాలి.

లా : కొత్త కొత్త బిల్లులు ప్రవేశపెట్టాలి.

కోటీ : నెక్సుట్.

డా : అస్త్మానం ప్రజల్ని పేల్చేసి, ఆ కేసుల్ని నా డిస్పెన్సరీకి పంపించాలి.

డా, లా : అంతే షాలు మాకు షాలు.

పరం : అవును బాబుగారూ! మేం అల్పసంతోషులం.

కోటీ : మీ అందరికోర్కెలూ నెరవేరుస్తానని ఈ మధుపాణం మీద ఒట్టేసి షేప్తున్నా.

లా : ఐ అబ్జక్ట్ యువరానర్. పరంధామయ్య భార్యమీద ఒట్టెయ్యాలి.

డా : అవును! ఆడదానిమీద వేస్తేనే బల్ బ్జుగా వుంటుంది.

పరం : (కళ్ళనీళ్ళు తిరుగుతాయి)

కోటీ : ఏం పరంధామయ్యా! వెయ్యమంటావా?

పరం : (కళ్ళనీళ్లు తుడుచుకుని) చిత్తం, చిత్తం! నామానం! నాప్రాణం అన్నీ ఎప్పుడో తమ అధీనం చేసేశాను.

కోటీ : సరే అయితే—పరంధామయ్య భార్యమీద ఒట్టేశాను,

లా : ఇప్పుడు మాకు నాట్యంకావాలి,

డా : పరంధామయ్య పెళ్ళాం నాట్యం చెయ్యాలి,

లా : అవును చెయ్యాలి సార్.

[చిన్న పిల్లలు మారాం చేసినట్టు డాక్టరు, లాయరు కోటీశ్వరయ్య చెరోవేపునా చేరి కాళ్లు నేల మీద కొడుతూ, చేతులాడిస్తూ చంటిపిల్లలు ఏడ్చినట్టు ఏడుస్తారు, కోటీశ్వరయ్య వాళ్లని బుజ్జగించాడు]

కోటీ : ష్! మా ప్రజలే! మా బుజ్జిప్రజలే! నాట్యం కావాలా అమ్మ!
ప్ప్! పరంధామయ్య పెళ్ళాం చెయ్యాలా? [పరందామయ్యతో]
ఏం పరంధామయ్యా! నన్ను నాయకుణ్ణి చేసేశారు ప్రజలు.
వాళ్ల కోర్కెల్ని నేను తీర్చాలి. అవునా?

పరం : చిత్తం! చిత్తం!

కోటీ : మరి ఆ ప్రజలు కోరుకుంటున్నారు ఏవంటావ్?

పరం : (ఏడుస్తూనే) చిత్తం, చిత్తం! అలానే!

లా : మరి తొరగా తీషకుఠా!

పరం ; కాని బాబులూ ఒక్కమాట!

డా : ఆలస్యం బరింషలేం. వెళ్ళూ!

కోటీ : అభ్యంతరాలు వొద్దు? అణుయుగం యిది: క్షణాలమీద జరిగి
పోవాలి.

పరం : ఒక చిన్నముక్క చెప్పి వెళతాను.

లా : షిన్న ముక్కలూ, పెద్దముక్కలూ ఒద్దు మాకు.

పరం : మాకు వాక్ స్వాతంత్ర్యం వుంది బాబూ!

డా ఏవిఁటీ :

లా వ్వాట్ ?

కో ( పక పక నవ్వాడు)

పరం ; నా మాట మాట్లాడుకోవడానికి నాకో చిన్న హక్కు....

డా : నాన్ సెన్స్:

లా : [కోటీశ్వరయ్యతో] ఆ హక్కు లాగేసుకోంటి.

కోటీ : అవును! రేపే బిల్ పాస్ చేయించేస్తాను....

వరం : కానీ.... బాబూ....

కోటీ : షటప్ రాస్కెల్! (కొట్టాడు) వెళ్లు. వెళ్లి తీసుకురా....

వరం : [కన్నీళ్లు తుడుచుకున్నాడు] సరే బాబుగారూ! (వెళ్ళాడు)

[వెడుతున్న పరంధామయ్యను చూసి ఫకాలున నవ్వారు అంతా]

కోటీ : ఎలాగయినా ఈ ప్రజలు గొర్రెల మందలు షుమా!

లా : ఇప్పుడా కనిపెట్టారు?

డా : మనిషి బ్లడ్‌లోనే ఆ తత్వం ఉందండి!

కో : సరే మరో గ్లాసు.

[అందరికీ Imaginary liquid serve చేస్తాడు]

డా ; For the health of -

కో, డా : స్త్రీ!

లా ; I object Your Honour! This is not స్త్రీ. This is Mrs Parandhamayya

కో : హాప్పీషు కున్నాం. (తాగారు మళ్ళీ)

డా ; Drink.

లా : Dandce.

అంతా ; And make merry,!

[నేపథ్యంలో రాక్ ఎన్ రోల్ సంగీతం. దానికి అనుగుణంగా స్టెప్స్ కలిపి ముగ్గురూ నృత్యం చేస్తారు. పైశాచిక నృత్యం గోల.... ఇంతలో అక్కడికి భిక్షులు వస్తాడు. లాయరు అతన్ని "కమాన్! కమాన్ భిక్షాలూ పాలు పంచుకో" అని

లాక్కొస్తాడు. భిక్షాలు భయంగా అతన్నించే తప్పించుకునే సరికి కోటీశ్వరయ్య యెదురుపడతాడు. అతన్నిచూసి హడలిపోయి భిక్షాలు పారిపోబోతాడు. ఆ చివరనున్న డాక్టరు అతని నడుం పట్టేశాడు. "బాబుగారూ!" అనిఏడుస్తూ డాక్టరు నుంచి తప్పించుకుని పారిపోయాడు]

డా : ఇడియట్, మేనర్‌లెస్ బ్రూట్:

కో : మనస్థాయికి పిలిచి వెధవల్ని మన సరదాల్లో పాలుపంచుకోమన్నాం,

లా : ఇలాంటి వెధవలకి స్వాతంత్ర్యం కావాలట. ఫ్రీడమ్:

డా : ఫ్రీడమ్‌కి డిఫనిషన్ తెలీని ఫూల్స్!

కో : ప్రజలు గొర్రెల మందలోయ్. వాళ్ళనలా వొదిలేసి రండి. మనం అనుభవిద్దాం.

లా : కరక్టు, కమాన్! డ్రింక్.

డా : డాన్స్!

కో : అండ్ మేక్ మెర్రీ!

[కోటీశ్వరయ్య 'పోస్టూ' వుంటే అంతా తాగారు. పిచ్చి నాట్యాలూ చేశారు. మైమరచి స్టేజంతా పశువుల్లా తిరిగారు. ఇంతలో పరంధామయ్య వచ్చాడు అతని వెనకాల లేడి పిల్లలా భయపడిపోతూ జానకమ్మ నిలబడి వుంది. ఆమె కళ్ళనిండా కన్నీటి ధారలు. రాక్షసులకు బలికాబోయే బలహీనురాలు. నృత్యాలూ, సంగీతాలూ ఠక్కున ఆగిపోయాయి. జానకిని వేయి కళ్ళతో దాహంతో చూస్తున్నారు. ఆమెను చుట్టుముట్టారు]

డా : బ్యూటీ :

లా : అప్సరసా!

కో : దివినించి భువికి దిగొచ్చిన దేవకన్యా?

[పరంధామయ్య కోపంతో కసెక్కిపోతాడు. పిచ్చివాడిలా జానకమ్మ చెయ్యి పట్టుకుని దాదాపు ఆమెను స్టేజిమధ్యకు విసిరి కొడతాడు. ఆమె కుప్పలా కూలిపోతుంది ఆమెచుట్టూ ఆకలి గొన్న తోడేళ్ళవలె కోటీశ్వరయ్య, డాక్టరు, లాయరు, తిరుగు తారు. హాహా కారాలు, అరుపులు, కేకలు! తక్కున స్టేజీమీద దీపాలు ఆరిపోయాయి. అందరూ ఒక్కసారి అరచారు. జానకమ్మ నిస్సహాయంగా భగవంతుడే దిక్కనుకునేట్టు ఆక్రందన చేసింది. ఆ ఆక్రందన సైరన్‌లా మెల్లగా నీరసించి పోయింది. స్టేజంతా చీకటి నిశ్శబ్దం. ఈనిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఎక్కడి నించో శ్లోకం వినిపిస్తుంది: ఆ శ్లోకం వినిపిస్తున్నపుడు ఒక స్పాట్ లైట్ పరంధామయ్య ఎఱ్ఱని ముఖంమీద పడుతుంది)

కంఠం : అధర్మా భిభవాత్ కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ,
పతంతి పితరో హ్యేషాం లుప్త పిండోదక క్రియాః

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకర కారకైః
ఉత్పాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః

అర్జున విషాద యోగం: శ్లో॥ 41, 42, 43)

(శ్లోకం పూర్తయాక పెద్ద స్పాట్‌లైట్ రంగస్థలం మధ్య పడుతుంది. ఆ వెలుతుర్లో స్పృహతప్పి పడివున్న జానకిదగ్గరకు పరంధామయ్య వెళ్ళాడు. అతనిలో యిప్పుడు బాధలేదు. శిల అయిపోయాడు. మెల్లగా వెళ్ళి శవంలా పడివున్న జానకిని చేతుల్లోకి తీసుకుంటాడు? వేలాడిపోయిన ఆమె ముఖంలోకిచూస్తూ బయటకు వెళ్ళిపోతాడు)

[ తెర ]

## మూడవ దృశ్యం

(భిక్షాలు గుడిసె. మధ్య ఒక్కటే కుర్చీ. ఒక మూలగా తులసి విచారంగా కూచుని వుంటుంది. లోపల నించి భిక్షాలు వచ్చాడు)

భిక్ష : ఇలా ఎంతకాలం ఏడుస్తూ వస్తు లుంటావ్ తల్లీ ? ఏడాదినించి ఏడుస్తున్నావ్: ఎవరిగుండె తరిగినట్టు! ఎవరి మనసు కరిగి నట్టు? లే తల్లీ!

తుల : (కళ్లు తుడుచుకుని లేచింది) ఈవాళ ఆయన్ని విడుదల చేస్తారు నాన్నా!

భిక్ష : జైలుకాడ కెల్తావా?

తుల ; చుట్టూ తోదేళ్ళున్నాయి నాన్నా!

భిక్ష : నన్నెల్ల మంటావా?

తుల ; వద్దునాన్నా! నీకిక్కడ పని ?

భిక్షా : బతుకంతా పస్చేస్తూ వున్నానమ్మా! కష్టపడ్డం అలవాటైపోయింది.

తుల : అందుకే వాళ్ళంతా జంతువుల్లా చూస్తున్నారు నాన్నా. సరేలే! ఆయనీ ప్రపంచంలో ఒంటరిగానే పుట్టారు. ఒంటరిగానే బ్రతుకుతున్నారు. ఒంటరిగానేవుద్యమాన్ని నడుపుతున్నారు .ఒంటరిగానే వుండటం అలవాటైపోయింది వారికి.

భిక్షా : అమ్మా! ఒక్కమాట.

తుల : ఏవిటి?

భిక్షా : నేను కోటీశ్వరయ్య బాబుగార్తో సెప్తాను. బూసనం బాబు చేసిన తప్పు మన్నించి మల్లీ పన్లోకి తీసుకొమ్మని.

తుల : భూషణంగారు ఒప్పుకోరు నాన్నా!

భిక్షా : నువ్వొప్పించు.

తుల : ఆ పని మటుకు చెయ్యలేను నాన్నా!

భిక్షా : అయితే నువ్వూ పన్సెయ్యక, అతనూ పన్సెయ్యక యింట్లో కూకుని వస్తుంది సస్తారా? తర్వాత నన్నే నుయ్యో గొయ్యో ఎతుక్కోమంటారు.

తుల : నాన్నా!

భిక్షా : ఇందులో నా కొరిగే దేటుందమ్మ? ఎవడికి పుట్టినసంతని మిమ్మల్నందర్నీ వొదిలేసుకుంటే— ఒక్క పేణం నాది— ఎలానో ఎక్కడో బతికి పోగల్ను. కాని యిది కడుపు తీల్లీ! కన్న కడుపు! రకతసంబంధం తెంపేసుకుని బతకలేను.

తుల : నాన్నా! నిన్ను బాధపెట్టాను కదూ? (ఏడ్చింది)

భిక్షు : (ఆమె కళ్ళు తుడిచాడు) అమ్మా! లేదమ్మ లేదు. సరే! బూసనం బాటొచ్చే ఏలయింది నేను జైలు కాడ కెల్లొత్తాను. తలుపు లేసుకో. బద్రం.

తుల : వుండు నాన్నా!

(తులసి అతని దగ్గరగా వస్తుంది. తల వెంట్రుకలు సర్దింది. చీర చెంగుతో అతని ముఖం తుడిచింది)

భిక్షు : ఈ సోకులన్నీ నాకెందుకు తల్లీ ?

తుల : నీలో ఆయన నన్ను చూస్తారు నాన్నా! నువ్వు జిడ్డు కారిన ముఖంతో వెడితే మనం ఎన్ని కష్టాలు పడిపోతున్నామో అని ఆయన బాధపడతారు. ఉఁ.... ఇప్పుడు చూడు.

(తులసి Imaginary అద్దం అతనికి చూపిస్తుంది! చీర చెంగుతో తుడిచి)

భిక్షు : పిచ్చితల్లీ! ఏంటి అద్దం కూడానా?

తుల : చూడునాన్నా! ఇందులో ఎవరు కనిపిస్తున్నారు?

భిక్షు : ఎవరగపడ్తారమ్మా? మా పిచ్చితల్లి తప్పిస్తే?

(భిక్షాలు నిష్క్రమిస్తూవుంటే తులసి సంతోషంతో నవ్వు కుంటుంది. ముఖం తుడుచుకుని Imaginary అద్దంలో చూసు కుంటుంది. దూరంగా ఎక్కడినించో తంబూరామీద గీతం వినిపిస్తుంది.)

తత్వం: ఎందుకే వో మనస ఎగిరెగిరి పడతావు
ఏదాంత మెరుగవే సిలకా!
ఏనాడు ఏలేరు ఎవరు సెప్పాగలరు?
ఎదురు కలలూ మానె మనసా!

నువ్వొకటి వూహిస్తె తానొకటి చేస్తాడు
మర్మంబు నెరుగవే సిలకా!
మంచి మనసుకు చోటు మహిలోన లేదులే
సిద్ధ గురునీ వాక్కు తెలుసా?

(తత్వం వినపడుతున్నంత సేపూ తులసి ఆనందంగా యిటూ అటూ తిరుగుతుంది. చివరి చరణంలో విషాదమేదో ధ్వనించి గతుక్కుమని ఒక చివర ఆగిపోయింది. చుట్టూపిచ్చిగా చూసింది. చరణం చివర వినపడగానే భూషణ్ రెండో చివర అగుపిస్తాడు. క్షణం ఎవరినోటామాట లేదు. తర్వాతతులసి "భూషణ్" అంటూ భూషణ్ "తులసీ "అంటూ చెరో వేపునుంచి రయ్‌నవస్తారు. వారు కలుసుకోక మునుపే దీపాలు ఠక్కున ఆరిపోతాయి)

o o o

(దీపాలు వెలిగేసరికి రంగస్థలం మీద నాలుగు కుర్చీలు వుంటాయి. అంతే కోటీశ్వరయ్య భవంతి బయటనించి పరంధామయ్య రయ్‌న వచ్చాడు. వేషధారణలో మార్పుంది. సిల్కు బట్ట వగైరా)

పరం : కోటీశ్వరయ్యగారూ! బాబుగారూ! బాబూ! బాబూ!

కోటి : (వస్తూ) ఏవిఁటయ్యా? ఏవిఁటి? ఇప్పుడేం కొంపలంటుకున్నాయి?

పరం : మెల్లగా అంటారేమిటండీ? ఘట్టిగా అనండి; కొంపలే అంటుకుంటాయిహ! ఆ వెధవ—భూషణ్‌గాడు విడుదలయ్యాడుతెలుసా?

కోటీ : తెలుసు. (కూచున్నాడు)

పరం : తెలుసూ అనిఅంత చల్లగా అంటారేమిటండీ? (అని కోటీశ్వ రయ్య పక్కనే కూచుంటాడు. కోటీశ్వరయ్య కోపంగాచూస్తాడు. తప్పు గ్రహించీ గ్రహించనట్టు లేచి నిలబడ్డాడు)

కో : అయితే యిల్లెక్కి అరవమంటావా?

పరం : అయ్యో మీ అమాయకత్వం కూలా! అంత శాంతంగా యెలా బ్రతగ్గలుగుతున్నారండీ? వాడు తిరిగొచ్చాడు, యిహానించి పక్కలో బల్లెమై తిరుగుతాడండీ?

కో : తిరగనియ్యి.

పరం : తిరగనియ్యి. ఎంత ధీమా అండీ మీది? వాడు ఎలక్షన్లలో నిలబడుతున్నాడండీ!

కో : నిలబడనియ్యవయ్యా! మనమూ నిలబడ్డాంగా.

పరం : ఆఁ ఆఁ! ఆమాట ముందే శలవిచ్చారు కాదేం? ఆఁ ఎప్పుడు? ఎలా? ఏ పార్టీ, ఏ గుర్తూ? మీ కిలాంటి మంచిపని చేయాలని ఎప్పుడు బుద్ధిపుట్టింది?

కో : (జేబులోనించి ఒక Imaginary కాగితాన్ని అందించాడు)

పరం : ఏమిటిది?

కో : టెలిగ్రాం.

పరం : ఎవరు పోయారు?

కో : పోవడం కాదు. వస్తున్నారు,

పరం : ఎవరు?

కో మంత్రిగారు. మరో కాసేపట్లో యిక్కడి కొస్తున్నారు.

పరం : ఆఁ! ఆఁ! ఆఁ! ఆఁ! ఆఁ! ఆఁ! ఏవిఁటీ నేను బతికేవున్నానా?

కో : గిల్ల మంటావా?

పరం : నిజంగా....న్నిజంగా....ఘనత వహించిన, గౌరవనీయులయిన మంత్రిపుంగవులు మన గృహాలను పావనం చేయడానికి....

కో : పరంధామయ్యా,

పరం : (తప్పు గ్రహించి) అదే, అదే! నాలాంటిఅల్పులకి, క్షుద్రులకీ దర్శనమిచ్చేందుకు వస్తున్నారంటే....

కో : వాళ్ళు దర్శనమిచ్చేది నీ లాంటి అల్పులకీ, క్షుద్రులకేనయ్యా అయితే వాళ్ళు నీకు దేవతల్లా అనిపిస్తున్నారా?

పరం : అంతకంటే ఎక్కువే.

కో : అయితే నీ అభిప్రాయం మార్చుకో. వీళ్ళంతా ఎవరయ్యా? 'మనం' నిలబెట్టిన వాళ్ళే! 'మనం' ఎన్నుకున్న వాళ్ళే!

పరం : ఏమైనా ...

కో : రేపొద్దుట ఎన్నికల చందాల కోసంతః కోటీశ్వరయ్య గేటు దగ్గర దేవుళ్ళాడవల్సిన వాళ్ళే! అలాంటి సామాన్యులకి నువ్వు లాంటి దైవత్వాన్ని అంట గట్టడం— అదీ నా యెదురుగా....

పరం : మన్నించండి బాబుగారూ, మన్నించండి! తప్పయిపోయింది. మంత్రిగారి పేరువినగానే ఈశ్వర, మహేశ్వర, పరమేశ్వరుల్లా నా చెవుల్లో ధ్వనించి అలా నోరుజారిపోయాను.... బాబుగారూ! నాదో చిన్న మనవి.

కో : ఏమిటి?

పరం : ఎలానూ మంత్రిగారు తమ గేటు ముందర కొస్తున్నారు. సమయంలో సమయంగా నన్ను కూడా వారి పరిచయం....

: చేస్తాలే ! అన్నట్టు ఈ పార్టీలో మీ జానకి నాట్యం చెయ్యాలయ్యా !

పరం : మా ఆవిడా !

కో : ఆఁ. ఫర్వాలేదు కథకళీ, మణిపురి ఏ కదంతొక్కినా మంత్రి గారు తలూపేసి ఉపన్యాస మిచ్చేసారు. పత్రికలవాళ్లు చాలా మంది వుంటారుగా— చచ్చినట్టు ఏదో వొకటి మాటాడతాడు.

పరం : కాని బాబుగారూ! అదిప్పుడు యిక్కడ లేదండి,

కో : ఎక్కడుంది?

పరం : ఆసుపత్రిలో.

కో : రప్పించు.

పరం : రాదండి.

కో : ఏం?

పరం : జబ్బు చేసింది.

కో : ఏం జబ్బు?

పరం : పిచ్చి.

కో : ఎప్పుడొచ్చిందయ్యోయ్?

పరం : అప్పుడోసారి యిక్కడికి తెచ్చాను కదా.

కో : మరిప్పుడెలా? మగువ, మద్యం లేకుండా మంత్రిగారికి పార్టీ యెలాగయ్యా? వారు బాధపడరూ?

డా, లా : (వస్తారు) కంగ్రాచ్యులేషన్స్ కోటీశ్వరయ్యగారూ !

డా : ఏవిటి? ఎలక్షన్లో నిలబడ్డారటగా?

కో : ఏదో ఉడతాభక్తి దేశానికి సేవ చేద్దామని!

లా : అప్పుడే చూశారా, మీకు మహానాయకుల వాక్కులొచ్చేశాయి!

డా : వారి పెర్సనాలిటీ ఎలాంటిది మరి?

లా : గెలిస్తే తప్పక మంత్రవుతారండీ!

కో : ఆఁ ఏవిఁటయ్యా లాయరుగారూ! నా వుపన్యాసం ఏవఁన్నా తయారు చేశారా?

లా : ఇదిగో చిత్తగించండి. (Imaginary పేపర్ అందిస్తాడు)

(కోటీశ్వరయ్య ఆ Imaginary పేపర్ని పరిశీలిస్తూ వుండగా బయట కారు హారన్ వినిపిస్తుంది. అందరూ అటు చూస్తారు)

లా : అదుగో మంత్రిగారొచ్చేశారు.

పరం : అయ్య బాబో! మంత్రిగారు! మంత్రిగారు!

(పరంధామయ్య ఖంగారుపడిపోయి ముందు బయటకు వెళ్ళబోతాడు. చివర్లో డాక్టర్ వున్నాడు. అతను పరంధామయ్యను వెనక్కి లాగేశాడు.)

డా : ఏవిఁటి! మంత్రిగారనుకున్నావా మజాకా అనుకున్నావా? (డాక్టరు ముందు బయటకు పోయాడు)

(పరంధామయ్య వచ్చి కోటీశ్వరయ్యమీద బడ్డాడు. కోటీశ్వరయ్య అతని షర్టు పట్టుకుని యింకా వెనక్కి లాగేశాడు.)

కో : ఏవిఁటా కుక్కపరుగూ నువ్వూ? (బయటకు వెళ్లాడు)

(పరంధామయ్య, లాయరుమీద పడ్డాడు. లాయర్ అతన్ని తిట్టాడు)

లా : ఛీ ఛీ! ఆఖరుకి నీ నీచపుబుద్ధి చూపించుకున్నావయ్యా!

(అని లాయరు పరంధామయ్యను వెనక్కి నెట్టేసి బయటకు పరుగెత్తాడు. ఇప్పుడు రంగస్థలంమీద పరంధామయ్య వొక్కడే మిగిలాడు. బయటకి వెళ్ళబోయాడు. వెళ్ళలేక పోయాడు. లోపలికి వెళ్ళబోయాడు. అక్కడ స్థలంలేదు. స్టేజీ మీద పిచ్చిగా తిరిగాడు. తిరిగి తిరిగి ఆగిపోయాడు. ఏదోతనలో తాను మాట్లాడుకున్నాడు. తర్వాత పిచ్చిగా అరిచాడు)

పరం : ఘనత వహించిన మంత్రిగారికీ.

(నేపథ్యం నించి కోటి గొంతుకలు 'జై' అన్నాయి. పరంధామయ్య హడలిపోయాడు. అర్థంగాక యిటూ అటూ చూశాడు. మెల్లగా అరిచాడు)

పరం : గౌరవనీయులైన మహా మంత్రిగారూ!

(నేపథ్యం నించి మరో కోటి గొంతుకలు 'జిందాబాద్' అన్నాయి దాంతో పరంధామయ్య రెచ్చిపోయి ఆనందంగా 'మంత్రిగారూ' అంటాడు. 'వర్థిల్లాలి' అని గొంతుకలుఅరిచాయి. పరంధామయ్య అలావొంటరిగా స్టేజీమీద పిచ్చిగా మంత్రిగారిని పొగుడుతూ నినాదాలు చేస్తాడు. చేస్తూనే వుండగా రంగంమీది దీపాలు క్రమేపీ ఆరిపోతాయి. చీకట్లో లాయర్, డాక్టర్ గొంతుకలు వినిపిస్తాయి. జయ జయ ధ్వానాలు, డాక్టరు "కోటీశ్వరయ్య గారికీ జై" అంటాడు. అక్కణ్ణుంచి అంతా గజిబిజి. జాతీయ గీతం ఒక వేపున, నవ్వులూ చప్పట్లూ విందులూ మరోపక్క! ఆ మధ్యనించే మంత్రిగారు 'సోదర సోదరీ మణులారా! నేడు మన సమాజం ఇంత నికృష్ట స్థితికి దిగజారడానికి కారకులెవరు?' అని అంటూ వుండగా గజ్జెల చప్పుడుతో విలాసిని నృత్యం.

మరో వేపునించి 'దరమ పెబువులు — మాదా కవళం పెట్టండి బాబూ' అని ముష్టివాడి అరుపులు)

('పోరా: పో: లోపల విందులవుతున్నాయ్. అని దర్వాన్ గద్దింపు. రాకెన్ రోల్. కధకళి, కూచిపూడి, మణిపురినృత్యాలు, చప్పట్లు, నవ్వులు. ఈలలు. దూరంగా ఎవరో 'దేశమంటే మట్టి కాదోయ్— మనుషులోయ్ ఈమనుషులోయ్' పాడతారు. 'వహ్వా! వహ్వా' మంత్రిగారి అరుపులు. ఇవన్నీ ఒకేసారి గజిబిజిగా వినిపిస్తాయి చీకట్లోనే; ప్రేక్షకులు చూడకూడదు. తర్వాత మెల్లగా శబ్దాలు క్రమేపీ తగ్గాయి. మెల్లగా దీపాలు వెలిగాయి.)

o o o

(దీపాలువెలిగేసరికి రంగస్థలంమీద కుర్చీలుండవు. ఖాళీ, ఒక బహిరంగస్థలం. నేపథ్యంలో యెక్కడో పరంధామయ్య గొంతు వినిపిస్తుంది. "కోటీశ్వరయ్య బాబుగారూ" అని— అంతా "జిందాబాద్" అంటారు. ఇలా నేపథ్యంలోనే నాలుగైదుసార్లు అన్నాక కుడివేపునించి కోటీశ్వరయ్య, డాక్టరు, లాయరు, పరంధామయ్య నినాదాలు చేసుకుంటూ వస్తారు. "నలుపే" "గెలుపు" అంటూ వుంటారు. ఎడంవేపునించి భూషణ్, తులసి వస్తారు. వాళ్ళు ఎడంవేపు చివరా, కోటీశ్వరయ్యా వాళ్ళూ కుడివేపు చివరా నిలబడ్డారు. ఎడంవేపున భూషణ్, కుడివేపున కోటీశ్వరయ్య తరపున లాయరు ప్రేక్షకులకు నమస్కారంచేసి ఉపన్యాసాలు ప్రారంభిస్తారు. ఇద్దరూ ఒకేసారి మాట్లాడతారు. ఇద్దరి మాటలు తారస్థాయిలోవుంటాయి. ఎవరిమాటలూ ప్రేక్షకులకు అర్థంకావు. లాయరు, భూషణ్ Simultaneous గా మాట్లాడానికి ప్రదర్శకులు అతి జాగ్రత్త వహించాలి)

భూ : సోదర సోదరీ మణులారా! ఈనాడు ఎక్కడచూసినా కటిక దారిద్ర్యం, ఆకలితాండవిస్తోంది. దీనిని కలిగిస్తున్న దెవరు? ఉన్న వాళ్ళదబ్బునీ నిత్యావసర వస్తువుల్నీ వాళ్ళ చీకటిగదుల్లో దాచేస్తున్నారు. ప్రజలు అవి లేక మాడి ఛస్తున్నారు. మాకు ఆకలేస్తోంది అని గట్టిగా అరిస్తే చాలు కొట్టి కొట్లలో తోస్తున్నారు. ఎంతకాలం ఇది యిలా సాగాలి? ఇదే మంచితరుణం. ఈ ఎన్నికల్లో నేనునిలబడ్డాను. మీ కోసం నిలబడ్డాను. నేను గెలిస్తే ఏం చేస్తానో ఇప్పుడు చెప్పను. చేసి చూపిస్తాను. సమాజంలో ఒకఆకలి చావైనా వుండదు.

లా: ప్రజలారా; మా మంచి మనుషులారా! ఎక్కడ చూసినా ఈనాడు మనకి అడు గడుగునా కనిపిస్తున్నదేమిటి? దారిద్ర్యం ఆకలి, దీనిని కలిగిస్తున్న దెవరు అనేప్రశ్న ఉదయించడం సహజం. నిత్యావసర వస్తువులు ఆకాశంలోకి పోతున్నాయి. అందుకోడానికి పేద ప్రజలు ఎగిరి దభాలున కిందపడిపోతున్నారు. వీళ్ళకిశక్తి నివ్వాలి. ఆకాశంలో వున్న వస్తువుల్ని ఎగిరి అందుకో గలిగే శక్తి కావాలి. ఆ శక్తి కావాలంటే కోటీశ్వరయ్య లాంటి ధర్మ ప్రభువులే యివ్వాలి, ఇవ్వాలంటే ముందు ఆయనకు శక్తి కావాలి కదా? ఆశక్తి మీ చేతుల్లో వుంది. ఆ శక్తిని ఒక్కసారి కోటీశ్వరయ్యగారికి ఇవ్వండి ఎన్నికల్లో గెలిచాక ఆయన మంత్రి అయి మీకు వేయిరెట్లు శక్తిని యిస్తారు.

(లాయరు, భూషణ్ మాట్లాడుతూ వుండగానే శాస్త్రజ్ఞుడు రంగస్థలం మధ్యకు వచ్చాడు. వెనక, మధ్యలో నిలబడి వీళ్ళ

పుపన్యాసాలని వింటున్నాడు. చివరి మాటలకు శాస్త్రజ్ఞుడు స్టేజీ ముందుకి వచ్చాడు. అతని వ్యాఖ్యానం మొదలు పెడతాడు. అతను వ్యాఖ్యానం మొదలుపెట్టినా లాయరు. భూషణ్ పుపన్యాసాలు మానరు. ఉపన్యసిస్తూనే వుంటారు అయితే వాళ్ళ మాటలుమాత్రం వినిపించవు. తతిమా Action మాత్రం అంటే lip movement etc, మాత్రం వుంటాయి)

శా : ఎన్నికల ప్రచారం యిది. ఇద్దరూ సమాజంలోని ఆకలినీ, దారిద్ర్యాన్నీ రూపుమాపుతా మంటున్నారు. ఎలా రూపు మాపుతారో చెప్తున్నారు. చెప్పింది ఏదీ అర్ధంకాదు మీకు. అర్థమయితే రేపు నిలదీసి అడుగుతారు. వాళ్ళ ప్రణాళికలు గొప్పవే కావచ్చు. భూతలాన్ని స్వర్గంచేసేస్తా మంటున్నారు. దానికే ఉపన్యాసాలూ, భేదాభిప్రాయాలూ, కొట్లాటలూ యెందుకు? అందరూ మానవ కల్యాణానికి పాటుపడేవారేగా, దీన్లో పోటీ యెందుకు? అంటే ఆ దేశ సేవలో ఏదో ఆశవుందన్నమాట. ఏదో స్వార్థముంది. (శాస్త్రజ్ఞుడు నిష్క్రమించడు)

(శాస్త్రజ్ఞుడు మాట్లాడుతూ వుండగా భూషణ్ ఉపన్యాసం పూర్తయింది. నినాదాలు చేసుకుంటూ Action only. No Sound. అతనూ, తులసి వెళ్ళిపోయారు. లాయరు ఉపన్యాసం పూర్తయింది. పరంధామయ్య Imaginary సోడా కొట్టిచ్చాడు. లాయరు తాగుతాడు)

కో : అబ్బాయిలూ! (అంతా అతని చుట్టూమూగాదు) ఇదంతా చూస్తూ వుంటే ఏమిటో! ప్రజలు నన్నింతగా ప్రేమిస్తున్నారా అని ఆశ్చర్యం వేస్తోంది.

డా : ఎందుకు ప్రేమించరండి?

పరం : ప్రేమించకపోతే పళ్ళు రాలగొడ్తామండీ!

లా : అసలు తమకా అనుమానం యెందుకు కలిగిందండీ? అలనాడు హనుమంతులవారికన్నా తన శక్తి తనకి....

పరం
డా : .... తెలిసేది కాదట!

కో : ఈ విధంగా చూసే మనకి అనుకున్న దానికంటే ఎక్కువవోట్లే వచ్చేట్లున్నాయ్.

లా : ఎందుకురావండి: నేనూ, డాక్టరూ, పరంధామయ్యా— ఎలాగూ మీ వోటు సరేసరి—నాలుగు మొత్తం.

డా : ఇక అటు: ఆ భూషణ్‌గాడికి ఎంతపడ్డా వాడివోటు ఆ భ్రష్టురాలు తులసి ఓటు— రెండేకదా?

పరం : భిక్షాలు?

కో : అదే అర్ధంకాదు,

లా : అర్ధంకాక పోవడ మేవిఁటండి: వాడు మీ ఉప్పుతినేగా బ్రతుకుతున్నాడు?

డా : అందువల్ల చచ్చినట్టు వాడు మీకే ఓటెయ్యాలి.

లా : లేదా బలవంతం చెయ్యాలి.

డా : లేదా వాణ్ణి, ఎక్కడికీ కదలకుండా యింట్లోనే కట్టిపడెయ్యాలి.

కో : అనవసరం. వాడొక్కడిఓటు నాకు పడకపోతే వో లెఖ్ఖకాదు.

పరం : అలా అనకండి బాబుగారూ! ఆవొక్క వోటే మహా మహా మహా నాయకులనుకున్న వాళ్ళనే ముప్పుతిప్పలుపెట్టి మూడుచెరువుల నీళ్ళు తాగిస్తుంది.

భిక్షు : (వచ్చాడు)

దా : అదుగో వాడే వచ్చాడు.

కో : భిక్షాలూ! రేపు వోటింగు అవుతోంది తెలుసా ?

పరం : అతనికి తెలీక పోవడమేవిఁటి ?

లా : కాబోయే అల్లుడేగా మనకి ఎక్స్‌పార్టీగా నిలబడింది?

దా : మరి నీ ఓటు ఎవరికిస్తావోయ్?

భిక్షు : ఎవరి కిస్తాను బాబయ్యా? మా బాబుగారికి తప్ప?

పరం : అటు నీ అల్లుడు నిలబడ్డాడు?

భిక్షు : ఎవరు నిలబడితే నాకేం బాబు? మా రాజులు, అడుక్కు నేవోణ్ణి తీసుకొచ్చి యింతోణ్ణి చేశారు. ఆరిరుణం జలమ జలమాలకన్నా తీర్చుకోగల్నా?

లా : నికార్సేనా

భిక్షు : బగమంతుడి సాచ్చిగా సెప్తున్నా బాబు!

పరం : సరే! బాబుగారి పెట్టిరంగు తెలుసా?

భిక్షు : నల్లది బాబయ్యా!

లా : దాంట్లో నే వేసెయ్.

దా : చూడూ. ఏ మాత్రం వీలున్నా నీ కూతురి వోటుగూడా అయ్యగారికి పడేట్టు ప్రయత్నించు.

భిక్షు : నా నెట్టా సెప్పగలను బాబయ్యా? దానికా బుద్ధి వుండాలి గాని?

లా : ఇన్నాళ్లూ అదికూడా బాబుగారి వుప్పేగా తిన్నది?

భిక్షు : ఆ గ్యానం దానికుండాల బాబయ్యా మరి.

కో : సర్లే! ఇక నువ్వెళ్లు.

(నమస్కారం చేసి భిక్షాలు వెళ్ళిపోయాడు)

లా : వీడు మీకు వోటేస్తాడంటారా?

డా : నాకేం నమ్మకం లేదు. తక్కువ జాతి బుద్ధి. మనెదురుగా ఒక మాటాడి....

కో : సరె మనకిక టైం ఎంతో లేదు. నడవండి.

పరం : జై, మహా చక్రవర్తి కోటీశ్వరయ్యగారూ!

అంతా: జిందాబాద్!

పరం : నలుపే!

అంతా; గెలుపు!

పరం : మీ ఓట్లు—

అంతా: నల్ల పెట్లో వెయ్యాలి.

పరం : తెల్ల పెట్లో—

అంతా: వెయ్యరాదు!

(వాళ్ళలా వినాదాలు చేసుకుంటూ పోతారు. ఇంత వరకూ రంగస్థలం మీద నిశ్శబ్దంగా వున్న శాస్త్రజ్ఞుడు వింగ్‌లోకి వెళ్ళి రెండు కుర్చీలు తెస్తాడు. రెండు పెట్టెలు తెస్తాడు, ఒకటి నల్ల నిది, మరోటి తెల్ల నిది. నల్లదానిమీద కోటీశ్వరయ్య పేరూ, తెల్లదానిమీద భూషణ్ పేరూ వున్నాయి. రెండుపెట్టెలనీ రెండు కుర్చీలమీద పెట్టాడు.

శా ఇప్పుడు ఇక్కడొక మహా సంగ్రామం జరగబోతోంది. ఇది సీక్రెట్ బాలెట్. రహస్య ఓటింగ్ పద్ధతి, ఇదొక యినప పెట్టె.

(రంగస్థలా న్నంతనీ చూస్తూపి) దీంట్లో గాలికూడా రావడానికి వీల్లేదు, భావాలు బయటనించి లోపలికి రావు. లోపల జరిగే నాటకం బయటకు తెలీదు. ఎవరు ఏంచేస్తారో, ఎవరు ఎవరికి వోటు వేస్తారో ఎవరికీ తెలీదు. యిది ప్రజాస్వామిక పద్ధతి. తన కిష్టమైన వాడికి ఓటు వేసుకోవచ్చు. ఈ క్షణంలో మహారాజు కూడా కూలివాడనుకునే దరిద్రుడి చేతిలో బానిస. సమాజాన్ని శాసించే నియంత జీవితాన్ని వొక్క క్షణంలో తలక్రిందులు చేసి పారేసే ఘడియ. దరిద్రుణ్ణి అందలమెక్కించ గలిగే శుభదినం. ఇలాంటి సదృశ్యాన్ని చూడగలిగే మీరునిజంగా అదృష్టవంతులు, ఇక్కడ బలవంతాలు లేవు. మనసులో జరిగే కల్లోలాలకు తావు లేదు. మనిషి మనసుని యిక్కడ మీరు నగ్నంగా చూడగలుగు తారు. ఎవరివల్ల ఎంత అపకారం ఎవరివల్ల ఎంత ఉపకారం సమాజానికిజరుగుతుందో మీకేతెలుస్తుంది .... సరేయిక ప్రారంభ మవుతోంది సంగ్రామం.

(శాస్త్రజ్ఞుడు స్టేజి వెనక్కి వెళ్ళి మధ్యలో విలబడ్డాడు. కుడివేపునించి కోటీశ్వరయ్య ఎడంవేపు నించి భూషణ్ ఒకేసారి ప్రవేశిస్తారు. ఇద్దరూ ఒకేలా అడుగులు వేస్తారు. ఆరడుగులు కోటీశ్వరయ్యవేసి, ఆరడుగులు భూషణ్ వేస్తాడు. అంటేఇద్దరూ మనుషులు వేరుగాని Action అద్దంలో కనిపించేటట్టే! ఇద్దరూ ముందు తమ తమ పెట్టెల దగ్గరకు వెడతారు. ఇద్దరి చేతుల్లో పెద్ద తెల్లకాగితాలు వుంటాయి. ఇవి Imaginary Papers కావు. నిజంగా కాగితాలే! ఆకాగితాలను తేరిపారచూసుకున్నారు. భూషణ్ కోటీశ్వరయ్య నల్లపెట్టె దగ్గరకూ, కోటీశ్వరయ్య భూషణ్ తెల్లపెట్టె దగ్గరకూ వస్తారు. విషసర్పాలను చూసినట్టు అసహ్యంగా చూసి 'హుం!!' అని ఇద్దరూ ఒకేసారి ఫీంకరించి

తమ తమ పెట్టెల దగ్గరకు వెళ్తారు. ఓట్లని తమ పెట్టెల్లో వేసి యిద్దరూ నిష్క్రమించబోతారు. ఇద్దరూ వింగ్‌ల దగ్గరకు చెరో వేపుకి వెళ్లి అక్కడకక్కడ ఆగారు. విరోధుల పెట్టెలను అస హ్యంగా చూసి వరుగునవస్తారు. కోటీశ్వరయ్య తెల్లపెట్టె పైకి ఎత్తేశాడు. భూషణ్ నల్లపెట్టెను కదపడానికి శత విధాల ప్రయ త్నం చేస్తూ వుంటాడు. శాస్త్రజుడు ఛటున వాళ్ళమధ్యకువచ్చాడు. శాస్త్రజ్ఞుడు వాళ్ళకి కనిపించడు, భూషణ్‌కి కోటీశ్వరయ్య, కోటీ శ్వరయ్యకు భూషణ్ కనిపించరు.)

శా : నొ నొ నొ! మీరు చేసేపన్లు ఏం బావులేవు. సభ్యత కాదిది.

(భూషణ్, కోటీశ్వరయ్య పెట్టెల్ని వొదిలేసి శాస్త్రజ్ఞుడి మాటలకు వులిక్కిపడి ముందు ఫుట్ లైట్స్ దగ్గరకు వచ్చేసి. స్టేజీకి చెరో వేపునా నిలబడతారు)

భూ
కో [ఒకేసారి] ఎవరు మాట్లాడేది?

శా : మీ అంతరాత్మను (కోటీశ్వరయ్య, భూషణులు విరగబడి నవ్వు తారు) ఆపండి! ఆపండి.. .ఎందుకా నవ్వులు?

కో : (ప్రేక్షకుల్ని చూస్తూనే) నాకో అంతరాత్మ వున్నట్టు తెలీనే తెలీదు సుమా!

భూ : (ప్రేక్షకుల్ని చూస్తూ) ఇంత వరకూ నువ్వెక్కడ దచ్చాప్ అంతరాత్మా?

శా : మీలోనే వున్నాను.

కో : అయితే చావు. (గుండెలమీద కొట్టుకుని పోతాడు)

భూ : నువ్వు నా కవసరం లేదు. (గుండె చేత్తో తీసేసి పోతాడు)

శా : [నవ్వుకుంటాడు] తర్వాత తులసి.

[తులసి వచ్చింది. భూషణ్ తెల్ల పెట్టె దగ్గరకు వచ్చి పూజ్యభావంతో పైట భుజాల నిండుగా కప్పుకుని తెల్ల కాగితం అందులోవేసి కోటీశ్వరయ్య పెట్టెవేపైనా చూడకుండా వెళ్లిపోతుంది.

శా : తులసీ!

తుల : ఎవరు ?

శా : నీలోని తులసిని.

తుల : (ఫుట్‌లైట్స్ దగ్గర నిలబడింది. ప్రేక్షకులనే చూస్తోంది) ఏవిటి కావాలమ్మా?

శా : భూషణ్‌కే ఎందుకు ఓటు వేశావ్ ?

తుల ; వారు నా భర్త.

శా ; అందుకనే వేశావా ?

తుల : వారి భావాలతో నేను చాలా వరకు యేకీభవిస్తున్నాను.

శా ; అతను రక్తపాతం, విప్లవాలూ కావాలంటున్నాడు.

తుల : నేను జరగనివ్వను.

శా : నీ మాట వినకపోతే?

తుల : [క్షణం ఆలోచించి] నువ్వెలా చెప్తే అలా వింటానమ్మా !

శా : నేను చంపెయ్యమంటాను.

తుల : [భయంతో వొణికింది] అమ్మా!

శా : ఏం నా మాట వింటానన్నావ్ ?

తుల : నేను అశక్తురాలిని! అశక్తురాలినమ్మా!

[ఏడుస్తూ వెళ్ళిపోయింది తులసి. శాస్త్రజ్ఞుడు వెనక్కి వెళతాడు]

శా : తర్వాత భిక్షాలు.

[భిక్షాలు వచ్చాడు. భూషణ్ తెల్లపెట్టె దగ్గర క్షణం నిలబడ్డాడు. ఆలోచించాడు. బరువుగా అడుగులేసుకుంటూ కోటీశ్వరయ్య పెట్టెదగ్గరకు వెళ్ళాడు. ముఖం తిప్పుకుని. ఎవరో బలవంతం చేస్తున్నట్టు కోటీశ్వరయ్య పెట్టెలో కాగితాన్నివేశాడు. వేసిన వెంటనే గబగబ వింగ్ దగ్గరకు పోయి, వెనక్కి భూషణం పెట్టెవేపు చూస్తూ "నన్ను మన్నించు బూసనం బాబూ! మన్నించు" అనేసి వెళ్ళిపోబోతాడు]

శా : భిక్షాలూ!

భిక్ష : నన్నెవరూ పిలవకండి బాబూ: నే న్రాలేను, నే న్రాలేను.

శా : ఫర్వాలేదు, రా భిక్షాలూ! [భిక్షాలు ఫుట్ లైట్స్ దగ్గర నిలబడ్డాడు] కోటీశ్వరయ్యకు ఓటెందుకు వేశావ్?

భిక్ష : [బిత్తర చూపులు]

శా : భయమా?

భిక్ష : [తల అడ్డంగా తిప్పాడు]

శా : నీకు డబ్బిచ్చారా?

భిక్ష : (తలఅడ్డంగా తిప్పాడు)

శా : మరెందు కేశావ్ భిక్షాలూ?

భిక్ష : ఆరు మూరాజాలు బాబూ! నా యజమాన్లు!

శా : నీకూతురుర్ని చెరచబోయాడే: నీ కాబోయే అల్లుణ్ణి జైల్లో

పెట్టించాడే। తన కడ్డం వచ్చిన వాళ్ళ నందర్నీ నాశనం చేశాడే ; ఎందరి బతుకుల్లోనో నీళ్ళుపోశాడే। పచ్చటి సంసారాలని కూల్చాడే: అతను తాగుబోతు: జూదరి, గుండా, వ్యభిచారి, రాక్షసుడు, కసాయివాడు।

భిక్ష : (చెవులు మూసుకుని ఏడ్చాడు) అపు: అపు: అపు: అరు నా యజమాన్లుబాబూ। అరు మారాజులు। ఆరిరుణం నా సెర్మంతో సెప్పులు కుట్టించినా తీర్చుకోలేను. ఇలాగన్నా తీర్చుకోనియ్ బాబూ: [పోతాడు ఏడుస్తూ]

(శాస్త్రజ్ఞుడు భిక్షలు వెళ్ళనవేపే చూస్తూంది పోయాడు. తర్వాత తేరుకున్నాడు)

శా : తర్వాత డాక్టరు స్వార్దేశ్వరం లాయరు వ్యాఘ్రేశ్వరం।

(నల్లకోటు సవరించుకుంటూ లాయరూ, ఆవలిస్తూ డాక్టరూ చెరో వేపునించీ ప్రవేశిస్తారు. మధ్యలో తారసర పడ్డారు)

లా : హలో డాక్టర్ ।

డా : హలో హలో! [ఇద్దరూ కరచాలన చేసుకుంటారు]

లా : పొద్దుటే ఏదో గిరాకీ తగిల్నట్టుందే– ఏ నాయకుడు పోయాదేవిఁటి ?

డా : ఎవడో పోయాడుగానీ తమరేవిఁటి యిలా ప్రొద్దుటే బయల్దేరారు– కేసులు లేవా ఏవిఁటి?

లా : ఏం కేసులు లెస్తురూ– ఎలక్షన్లు అయిపోతున్నాయా– ముండా కొడుకులు తన్నుకోవడం తగ్గించేశారు.

డా : నా స్థితీ అలానే వుందండి. కొత్త మందులు కనిపెట్టేసి మా నోళ్ళల్లో మన్ను కొట్టేస్తున్నాయి ఈ పేటెంట్ మందుల

కంపెనీలు. జబ్బులేక ప్రజలు మల మల — మాడిపోతున్నా రంటే నమ్మండి!

లా : సర్లెండి. వస్తామరి గుడ్ బై.

డా : బై బై!

(డాక్టరు, లాయరు చెరో వేపు వింగ్ దగ్గరకు పోతారు)

శా : ఆగండి,

లా, డా : [ఇద్దరు ఒకేసారి వెనక్కి తిరిగారు] మీరా పిలిచారు?

లా, డా : (ఒకేసారి సమాధానం యిచ్చుకున్నారు) అబ్బే నేను కాదే!

శా : నేను.

(డాక్టరు లాయరు చుట్టూ చూస్తారు)

శా మీ అంతరాత్మను.

(లాయరు, డాక్టరు ముఖాలు చూసుకుని ఫకాలున నవ్వుకుంటారు)

లా : మనకి ఓ అంతరాత్మ వుందటండీ?

డా : ఏమో! నేనెప్పుడూ అంత పరీక్షగా చూశ్శేదు.

లా : అరె! మళ్ళీ మన అంతరాత్మ మాట వినిపించదేం ?

డా : ఓహోయ్— అంతరాత్మోయ్!

లా : ఎక్కడ! ఎక్కడ ?

శా ; ఇక్కడ.

డా : నాకు సైట్ వచ్చిందేవిఁటి చెప్మా. యేం కనిపించటంలేదు!

లా ; ఓహోయ్! అంతరాత్మా! ఏవిఁటి కావాలి?

కా : ఈవాళ యిక్కడ ఓటింగ్ జరుగుతోందని మీకు తెలీదా ?

డా : అవునండోయ్। బయట కాగితాలు కూడా యేవో యిచ్చారు।
(జేబులు వెదికి కాగితం తీశాడు)

లా : (తనూ కాగితం తీశాడు) అవునండోయ్ జ్ఞాపకం వచ్చింది.
మరీ మరీ చెప్పాడు ముండాకొడుకు తన పెట్లోనే వెయ్యమని.

డా : ఏ రంగని చెప్పాడు కోటీశ్వరయ్య?

లా : ఏ రంగో పింజాకూరు। దేంట్లో వో దాంట్లో తోసేస్తేసరి।

డా : పదండి పెట్టెక్కడుందో వెతుకుదాం.

(ఇద్దరూ కాసేపు వెదికారు)

డా : ఇక్కడేదో తలిగిం దండోయ్. పెట్టెలాగుంది.

లా : పెట్టెకాకపోతే నా తలకాయ్ ఏముంటుందిక్కడ?

డా : ఇక్కడ రెండు పెట్టెలు తగలబడ్డాయి — ఎవరి కేద్దామంటారు?

లా : ఏ వెధవకేసినా వొకటే — ఎవడి కేసినా మనకి వొరిగేదేం
వుండదు.

డా : అయితే ఈ ఓట్లనేం చేద్దామంటారు?

లా : చెప్తా యిలా యివ్వండి।

[డాక్టర్ చేతిలో కాగితాన్ని తీసుకుని, తన కాగితంతో కలిపి రెండింటినీ ముక్కలు ముక్కలు చేసేసి ప్రేక్షకుల్లో వూదేసి నవ్వాడు. డాక్టర్ తెల్లబోయి, తర్వాత అర్థమయినట్లు నవ్వేశాడు]

డా : ఆ ఆ(। సరిగ్గా నా మనస్సులోని భావాన్నే వ్యక్తం చేశారు।
వస్తామరి।

లా : వెళ్ళండి. శవాల్లో లిటిగేషన్లుంటే మటుకు కబురు చెయ్యడం మరచిపోకండే!

డా : అలానే! ముందు మనుష్ల్ని మనగ్గరికి పంపించండి. శవాలు వాటంతటవే వొస్తాయి.

[ఇద్దరూ చెరోవేపుకి నిష్క్రమిస్తూ వుండగా శాస్త్రజ్ఞుడు "ఆగండి" అన్నాడు. ఇద్దరూఆగి ఫుట్‌లైట్స్ దగ్గరకొచ్చి రంగ స్థలానికి చెరోవేపున నిలబడి ప్రేక్షకులవేపే చూస్తూ వుంటారు]

శా : మీరు చేసిన పనేమిటి?

డా, లా : చించేశాం!

శా : బావుందా ఆ పని? మీరు చించేసిందాంట్లో యెన్ని కోట్ల కోట్ల శక్తి నాశనమయిపోయిందో తెలుసా?

[డాక్టరు, లాయరు బిరగబడి నవ్వారు]

డా : చూడు! డాక్టర్ అంతరాత్మా! ఇలాంటి పెద్ద విషయాల జోలికి పోయి ప్రబోధాలు చేశావా అపరేషన్ చేసేసి పారేయగలను. (అని Imaginary అంతరాత్మను పట్టుకుని జేబురుమాల్లోవేసి కుక్కుకుని పోతాడు)

లా : ఇలాంటి వెధవ్వేషాలేసి అరిచావంటే జైల్లో తోయించేగలను రా వెధవా! (అని అంతరాత్మను చెవిపట్టుకుని ఈడ్చుకొని వెళ్ళిపోయాడు)

శా : (వెళ్ళిన వాళ్ళని చూస్తూ) Intellectuls' High brows Pillars of Society (నవ్వుకుంటాడు) తర్వాత— పరంధామయ్య.

(పరంధామయ్య బయటనించే నినాదాలు చేసుకుంటూ వస్తాడు)

పరం : కోటీశ్వరయ్యగారికీ! జై! మహాచక్రవర్తి కోటీశ్వరయ్యా: జిందా బాద్! కాబోయేమంత్రిగారూ! వర్ధిల్లాలి. నలుపే గెలుపు....నలు. పే....గె....లు....ప్ (చుట్టూ చూశాడు. ఎవరూ కనిపించరు. గుండె ధైర్యం చేసుకుంటాడు) సీక్రెట్ బేలట్ అంటారు! ఇదే కామోసు. అః! ఎంత పకడ్బందీగా వుంది: (Imaginary గోడల్ని ముందు చేతుల్తో తట్టి, తర్వాత భుజంతో కదిపాడు) అబ్బ! ఇనుంతో తయారు చేసినట్టున్నారే! అహా బోషాణంలా వుంది! ఇనప్పెట్టెలా వుంది. ఎలక్షన్లు అయిపోయాక ఎంచక్కా దీన్ని యింటికి దొర్లించుకుపోతే బావుణ్ణు. మన బాబుగారే మం త్రవుతారటగా— అడిగితే కాదన్రు! (కోటీశ్వరయ్య నల్లపెట్టె దగ్గరకు పెట్టెను ఆప్యాయంగా తడిమి చూశాడు) ఎంత మృదు వుగా వుంది? ముద్దొచ్చే నల్లరంగూ అదీ! (ఎత్తబోతాడు. కాని ఎత్తలేడు) అబ్బ దీన్నిగ్గొయ్యా! మహచెడ్డ బరువుగా వుందే! ఓట్లు మహ జోరుగా పడ్డట్టున్నాయ్! వూరువూరంతా బాబుగారికే వేసినట్టున్నారే! (భూషణ్ పెట్టె దగ్గరకు వెడుతూ) ఏం మిత్ర మా! ముఖం అలా ఆర్పేసిన కొరకంచులా వుంది! వోట్లు యేమైనా పడ్డాయా? (పెట్టెను సునాయంగా యెత్తేశాడు) హారి! ఒకవోటూ పళ్ళేదేమిటి చెప్మా! ఏం భోషాణంబాబూ! నీ వోటు కూడా నువ్వేసుకోలేదా యేం? పాపం! డిపాజిట్టుకూడా పోయే ట్టుందే! ఎందుకు భయపడతావ్! నా వోటు నీ కేస్తాలే! తీసుకో! (తన వోటు భూషణ్ తెల్లపెట్లో వేసేసి, వెళ్ళిపోతూ వింగ్ దగ్గర ఆగి మళ్ళీ కోటీశ్వరయ్య పెట్టెదగ్గరకు వచ్చాడు) ఫర్వా లేదు బాబుగారూ! కడవడు నీళ్ళలో ఒక పాలచుక్క. మనకేం! మన పెట్టెనిండా వూరందరూ పాలే పోశారు. వెధవకి డిపా జిట్టు కూడా పోతుందని జాలి తలచి వేశాను. మరేం భయంలేదు.

గెలుపు మనదే, తమరే మంత్రవుతారు. వస్తా! నమస్కారం బాబూ: (వెళ్ళిపోతూ వుంటాడు.)

శా : పరంధామయ్యా!

పరం : (ఆగాడు)

శా : ఇలారా! (పరంధామయ్యవచ్చి ఫుట్ లైట్స్ దగ్గర నిలబడతాడు) నువ్వెవరికి వోటు వేశావ్?

పరం : మా బాబుగారికి,

శా : ఎవరు మీ బాబుగారు? భూషణా?

పరం : (భయంగా శూన్యాన్ని చూశాడు) ఎవర్నువ్వు?

శా : నీ అంతరాత్మను.

పరం : (గుండెపట్టుకుని) నువ్వెందుకు బయటకొచ్చావ్?

శా : నువ్వు చేస్తున్న ద్రోహాన్ని చూడాలని.

పరం : నే నెవరికీ ద్రోహం చెయ్యలేదు.

శా : కోటీశ్వరయ్యకు ద్రోహం చెయ్యలేదా?

పరం : లేదు.

శా : ఓటు భూషణ్ కి వేశావ్!

పరం : నా యిష్టం!

శా : నీకు కోటీశ్వరయ్య డబ్బుయిచ్చారు. మూడు మేడలు కట్టించుకున్నావ్! పది బస్సులు తిరుగుతున్నై నీ పేరుమీద! రెండు లాంచీలున్నై. హోటల్సు వున్నై. అవన్నీ కోటీశ్వరయ్య డబ్బుతో కొన్నవి కాదా?

పరం : అయితే?

శా : కృతజ్ఞతనేది?

పరం : కృతజ్ఞతంటే వోటు ఆయనకే వెయ్యాలా? అయితే రహస్యంగా ఈ వోటింగెందుకు?

శా : ఆయనకే వోట్లిమ్మని ప్రచారం చేశావ్।

పరం : నేనిస్తానని చెప్పలేదు.

శా : భూషణ్ నీకేం వొరగబెడతాడు?

పరం : నీకనవసరం.

శా ; నీ ఒక్కవోటుతో భూషణే గెలిచాడు తెలుసా?

పరం : తెలుసు.

సా : తెలిసే వేశావన్నమాట.

పరం : అవును.

శా : అదే యెందుకు?

పరం : అర్థంలేని ప్రశ్నలు వెయ్యకు,

శా : కృతఘ్నుడా!

పరం : ఇంకా వున్నాయి నాకు బిరుదాలు. బదనిక, పరభాగ్యోపజీవి, స్వార్థపరుడు, వంచకుడు, పడుపుకూడు తినేవాడు, స్వామి ద్రోహి....

శా : నీ దగ్గర్నుంచి సరయిన సమాధానం కావాలి.

పరం : చెప్పను.

శా : చంపేస్తాను.

పరం : (నవ్వాడు) ఎప్పుడో చచ్చిపోయాను. ఈ కోటీశ్వరయ్య అండన చేరినప్పుడే నాచావు మొదలయింది. నాభార్యమీద ఆవెధవ

కన్ను వేసినప్పుడు సగంచచ్చాను. నా బ్రతుకునీ, నా ప్రాణాన్నీ, నా నీతినీ, నా మానాన్నీ ఆనీచుడు హస్తగతం చేసుకున్నప్పుడే చావడం తప్పదని తెలుసుకున్నాను. చివరికి.... నా భార్యను చెరచి. సర్వనాశనం చేసినప్పుడు పూర్తిగా చచ్చిపోయాను.

శా : అయినా అతని వెనకాలే తిరిగినావ్?

పరం : బ్రతకాలి గనుక.

శా : దేనికి బ్రతకడం? నీతి పోయింది. నీ భార్య పిచ్చిదయింది. నీ బ్రతుకు బట్ట బయలయింది. ఇంతఅవమానంలో, సిగ్గుతో దేనికి బ్రతకడం యింకా ?

పరం : దేవుణ్ణి వెయ్యాల్సిన ప్రశ్నలవి.

శా : మధ్య దేవుడెందుకు?

పరం : మనిషికి ప్రాణంమీద ఎందుకింత తీపిని కలిగించాడు? నా అన్న వాళ్ళు వొకళ్లా వొకళ్లా చచ్చిపోతున్నా— నా జీవితం శూన్యమై పోతున్నా — నేను బ్రతకాలనుకొంటున్నాను. ఎందుకు? ఏమో అందుకే యిన్నిమోసాలు చేస్తున్నాను.

శా : బ్రతకడానికి యింత మోసమా? ఇంత నీచత్వమా ?

పరం : అర్థంలేని మాటలు అంతరాత్మా! అర్థంలేనిమాటలు! నేను చావ కూడదు. బ్రతకాలి. సంఘంలో బ్రతకాలి. మనిషిగా బ్రతకాలి. సంఘంలో మనిషిగా బ్రతకాలి. అలా సంఘంలో బ్రతకడానికి నీతి కావాలి. నిజమే. కాని నన్నెవరు నీతిగా బ్రతకనిస్తారు? నన్నెవరు మనిషిగా బ్రతకనిస్తున్నారు? ఏదో ఒకటి విడిచి పెట్టుకోవాలి. నీతినా? జీవితాన్నా? నేనుపిరికివాణ్ణి: ధైర్యంలేదు. అధమాధమ భావాలకుదాసుణ్ణి! దస్యుణ్ణి. 'నన్ను' నేనుఏనాడో

చంపేసుకున్నాను. చంపుకున్నప్పుడు ఏడ్చుకున్నాను. కడుపు తరుక్కుపోయేట్టు యేడ్చాను. ఎవరికీవినిపించలేదు నాయేడుపు. ఎవరూ పట్టించుకోలేదు. ఆకలికి తట్టుకోలేక నా భార్యాబిడ్డలు దీనంగా నా వేపుచూసినప్పుడు నేనేం చెయ్యలేక పోయాను. సంఘాన్ని అడుక్కున్నాను ప్రాధేయ పడ్డాను. ఏడ్చాను. మొత్తుకున్నాను. ఎవరూకరగలేదు. నేను బ్రతకాలి, బ్రతకాలి, బ్రతకాలి. అదే నా ధ్యేయబ అయిపోయింది. అదే నా భయం అయిపోయింది. ఎలాగైనా బ్రతికిపోవాలి. పశువునై పోయ న్నా బ్రతికెయ్యాలి. మానవత్వాన్ని చంపేసుకునైనా బ్రతి కెయ్యాలి. మానవత్వాన్ని చంపేసుకుని పశువునై పోయినా సంఘం పట్టించుకోదని గుర్తించాను, నాలో వున్న శక్తి మరో మార్గానికి మళ్ళించి బ్రతికెయ్యా లనుకున్నాను, అబద్దాలు నేర్చాను. మోసాలు చేశాను. వంచనలు ప్రయోగించాను. ఫలి తాలుకనిపించాయి. మోసంచేసి బ్రతకొచ్చనిపించింది. అక్కడి నించి మానవత్వం చచ్చిపోవారంభించింది. చచ్చింది చివరకి. పూర్తిగా చచ్చింది. చచ్చాక పశుత్వం మిగిలింది. మెల్లగా లేచింది, ఆవులించింది. వొళ్లు దులిపింది. ఘీంకరించింది. గర్జించి నా వశంతప్పింది. అదుపులోకి తీసుకురాలేకపోయాను. నోరుచాచి నన్ను బలికోరింది. నేనుచావకూడదు బానినయిపో నారంభించాను. సభ్యత, మానం, మర్యాద, మంచీ, చెడూ, నీతీ, నియమం, యుక్తం, ఆయుక్తం ఏవీ అర్థంకాని చెవిటి వాడినయ్యాను. నీకు తెలీదు అంతరాత్మా! ఆనాడు నా భార్య ఎంత దీనంగా ఆక్రందనలు చేసిందో. నా యెదురుగానే నాశన మైంది. ఏడ్చింది. సహాయం చెయ్యమని గొంతెత్తి అరచింది. నేను దేవుణ్ణికాదు, దేవుడనుకునేవాడు ద్రౌపతిలాంటి వారికే సహాయం చేస్తాడు. దేవుడూ కళ్ళు మూసుకుని, నేనూ నిస్సహా

యున్నాయి— నా భార్య, నా అర్ధాంగి నా కళ్ళముందరే పశువుల పాలయింది. [నల్లపెట్టె చూపిస్తూ] అదిగో, వాడు. నన్ను నాశనం చేసేశాడు. నన్నూ, మిమ్మల్నీ అందర్నీ నాశనం చేసేస్తాడు వాడే! మీరూ నోరెత్తలేరు. భయం, పిరికితనం బ్రతుకు మీద ఆశ— మనల్ని వాడికి బానిసల్ని చేసేసంది. నా కోపం, కసీ వాడిమీద యెదురుగా తీర్చుకోలేను. ఇక్కడ— ఎవరూ చూడరు. ఎవరూ చూడని యినప గోడలు: ఎవరూ రాలేని వుక్కు పంజరం— నా యిష్టం, నా బాధనీ, వ్యధనీ, విచారాన్నీ, ఏడుపునీ, ఏడ్చుకోగలను. ఏడ్చుకోనియ్. ఇదైనా నాకు ప్రసాదించు. నా కసిని యిలాగైనా తీర్చుకోనియ్, నల్లపెట్టెను పిచ్చివాడిలా కొడతాడు, వీడు బ్రతక కూడదు. వీడు సమాజంలో బ్రతికుండకూడదు. ఈ చీడను నేనుంచను. వుంచలేను. కాని నిస్సహాయుణ్ణి — [ఏడ్చాడు] ఏం చెయ్యలేను. నాలో బలంలేదు. నా వెనుక బలగంలేదు నాలో శక్తి లేదు. శక్తి వున్న వాళ్ళనువీడు కాల్చిపారేస్తున్నాడు. వీడి వేళ్ళు భూమి లోకిబలంగా పాతుకుపోయాయి. భగవంతుడా! ఎందుకు వీడ్నింకా బ్రతికించి వుంచావ్? ఎందుకు వీడిచేత మమ్మల్నిలా హింసిస్తావ్? మేమేం పాపం చేశాం? ఆడవాళ్ళని చెరుస్తున్నాడే! మా మానాలనీ, ప్రాణాలనీ హరించేస్తున్నాడే! మా సర్వస్వాన్నీ వేలం వేసి విలాసంగా నవ్వుతున్నాడే! వీడ్ని క్షమించగలమా? వీణ్ని ప్రాణాలతో విడిచి పెట్టగలమా? ఉహుఁ, నేను భూషణ్‌కే వోటు వేస్తాను నేను బ్రతికున్నంత కాలం భూషణ్‌కే వేస్తాను భూషణే మాకు యేనాటికయినా దారి చూపిస్తాడు.... నన్ను భూషణ్ తిడతాడు. నేను భూషణుకి అర్థంకాను, అతను నన్ను చంపెయ్యొచ్చు, సరే! అతని చేతిలోనే చస్తాను. హాయి

గా, ఆనందంగా చస్తాను. కాని నా వోటు భూషణుకే పడిందని అతనికి తెలీకూడదు. నా పాపపు వోటువల్లే అతను గెలిచాడని అతనికి తెలీకూడదు. భూషణు గెలవాలి. అతనే గెలుస్తాడు. భూషణ్ బాబుకీ జై! భూషణ్ జిందాబాద్! భూషణ్ వర్ధిల్లాలి. భూషణ్ బాబుకీ జై! భూషణ్ జిందాబాద్! భూషణ్ వర్ధిల్లాలి, [ఏడుస్తూ పోతాడు]

[శాస్త్రజ్ఞుడు అతను వెళ్ళినవేపే చూస్తూ వుండిపోయాడు, తర్వాత పెట్టెల దగ్గరకు వచ్చేడు. వీటిలో పడ్డవోట్లని బయటకు తీశాడు]

శా : ప్రజాస్వామిక పద్ధతుల్లో ఈ ఓటింగ్ జరిగింది. ఇక్కడ ఎవరూ ఎవరి బలవంతాలూ లేకుండా వోటు చేశారు, అంత రాత్మ ప్రబోధించినట్టు ప్రవర్తించారు. వోటర్ల అంతర్గత స్వరూపాన్ని అతి నగ్నంగా చూడగలిగారు. ఈ ధర్మ యుద్ధంలో భూషణ్‌కి మూడువోట్లు; కోటీశ్వరయ్యకు రెండువోట్లు పడ్డాయి. రెండువోట్లు పడలేదు. అంటే గెలిచిన వ్యక్తికి నూటికి నలభై, ఓడిన మనిషికి నూటికి ముప్పై వోట్లు పడ్డాయి. జనాభాలో సగం కంటే ఎక్కువ మందికి గెలిచిన అభ్యర్థిమీద యిష్టంలేదు. నూటికి ముప్పైమందికి ఓడిపోయినమనిషంటే సానుభూతివుంది. మూడవవంతు జనాభాకి అసలు ఈ అభ్యర్థుల మీదా, ఈ విధానం మీదా: ఈ పరిపాలనమీదా అసలు నమ్మకమే లేదు.

[బయట పెద్దకోలాహలం వినిపిస్తుంది. 'భూషణ్ బాబుకీ' 'జై' భూషణ్ జిందాబాద్, అనే నినాదాలు పెద్దపెట్టున వినిపిస్తాయి. క్రమేపీ రంగస్థలం మీద దీపాలు ఆరిపోతాయి]

o o o

[ఇప్పుడు కోటీశ్వరయ్య భవంతి. నాలుగు కుర్చీలు వుం దవు. స్టేజంతా ఖాళీ, దీపాలు వెలిగేసరికి కోటీశ్వరయ్య బయట నించి కోపంగా వస్తాడు]

కో : నన్ను సర్వనాశనంచేసేశారు. సర్వనాశనంచేసేశారు. నమ్మించి ద్రోహం చేసేశారు. నా డబ్బుతిని నన్నే గోతిలో దించేశారు. నా, నా, నా, పగ తీర్చుకుంటా! నేనూ వీళ్ళని సర్వనాశనం చేసేస్తాను.... ఎవరు నన్ను బలపరుస్తున్నట్టు? ఎవరు నన్ను ప్రేమిస్తున్నట్టు? ఎవరు నా క్షేమం కోరుతున్నారు? ఎవరు? ఎవరు, ఎవరు? నా దగ్గర కోట్లున్నాయి. అవన్నీ తీసేసుకోండి, అవన్నీ మీకే యిచ్చేస్తాను. కాని చెప్పండి: ఎవరు నన్ను నిజంగా ప్రేమిస్తున్నారు? ఎవరు నాక్షేమాన్ని కోరుతున్నవాళ్లు? ఎవర్ని నమ్మడం?.... భిక్షాలూ! ఒరే భిక్షాలూ! పరంధామయ్యా స్వార్ధేశ్వరం! వ్యాఘ్రేశ్వరం!

భిక్షా : (వచ్చాడు) బాబుగారూ!

కో : స్కౌండ్రల్! నా వుప్పుతిని నాకేద్రోహం తలపెట్తావా ఎవరి? కిరా నువ్వు ఓటేసింది?

భిక్షా : బాబుగారూ! తమరికే నా ఓటేసినాను బాబుగారూ!

కో : నాకు వేశావా? నా సొమ్ముతిని నారొమ్మే గుద్దుతావా? (భిక్షాలు) పీక పిసికాడు, నాకే వేశావురా? నిన్ను చంపిగాని వొదలను. నీ రక్తం కళ్ళజూస్తా!

భిక్షా : (ఏడ్చాడు) బాబుగారూ! బాబూ! తమరికే ....తమరికే ....నా ఓటు....

కో : వేశావురా! అందుకే అనుభవించు. నిన్నేకాదు నీ కుటుంబాన్నే సర్వనాశనం చేసేస్తాను. చావు! చావు!

(పేక పిసికేశాడు. భిక్షాలు కింద పడిపోయాడు. తులసి పరుగున వచ్చింది. రాక్షసుళ్ళా విజృంభించి పోతున్న కోటీశ్వర య్యను తోసేస్తుంది. కోటీశ్వరయ్య తూలిపోయాడు. తులసి తండ్రిశవంమీద పడి ఏడ్చింది.)

తులసి : (కోటీశ్వరయ్యతో) నీచుడా! ఇదే కదూ నీ కృతజ్ఞత? జీవితాం తం నిన్నే నమ్ముకుని, నీ మాటకు ఎదురుచెప్పక చివరికి మాకు కూడా ఓటు వెయ్యకుండా నీకే ఓటేసిన అమాయకుణ్ణి చంపు తావా ?

కో : వాడు నాకు వోటేశాడా ?

తులసి : డబ్బు గర్వంతో కళ్ళు మూసుకుపోయాయ్— నీకేం తెలు స్తుంది. నౌకరు మనస్సు? నిన్నే దేవుడుగా, నిన్నే భగవంతు డుగా, నిన్నే సర్వస్వంగా భావించుకున్నమనిషిని నీ అహంతో అజ్ఞానంతో పొట్టన బెట్టుకున్నావ్? నాన్నా! నాన్నా! ఈ మూర్ఖు ల్ని ఎందుకు నమ్మావ్ నాన్నా? వీళ్ళ సుఖాల కోసం 'నిస్వా ర్థంగా వీళ్ళకి సేవలు చేశావ్! ఫలితం చూడు నాన్నా! చూడు.

కో : అదే ఫలితం నువ్వూ అనుభవించు. (చెయ్యి పట్టుకున్నాడు)

తుల : విడిచిపెట్టు! విడు!

(తులసి అతని చేతుల్లో పెనుగులాడింది. ఆమెను బలా త్కారంగా పడక గదిలోకి తీసుకుపోతాడు. ఆమె ఏడ్పులు కోటీ శ్వరయ్య నవ్వులు. ఆమె ఆక్రందన. భూషణ్ దూరం నించి గొంతుక చించుకపోయేట్టు 'తులసీ! తులసీ! తులసీ' అని అరచు కుంటూ వస్తాడు. సమాధానంరాదు కిందపడిన భిక్షాలు కనిపిం చాడు. )

భూ : భిక్షాలూ! (లేవనెత్తబోయాడు. శవం చుట్టూ చూశాడు.) ఏవిఁటి భిక్షాలూ యిది! ఇలాంటి చావు చావడానికే యిన్నాళ్ళూ నా అనే స్వార్థం చూసుకోకుండా కష్టపడ్డావు? ఇందుకేనా నువ్వు మానవ జన్మ ఎత్తింది? మనిషిగా నువ్వు నేర్చుకున్నదేవిఁటి భిక్షాలూ? నేర్పించిందేవిఁటి? జీవించింది ఎవరి కోసం? నేను గెలిచాను భిక్షాలూ! నీ కోసం గెలిచాను. మీ కోసం గెలిచాను నువ్వు నాకు వోటు యివ్వకపోయినా గెలిచాను. నా ఆశయాలకు ఒక రూపం కల్పించుకునే రోజు వచ్చింది. మన బ్రతుకులకు ఒక క్రమం ఏర్పడే దినంవచ్చింది, చూడవ్. ఇది నీకోసం భిక్షాలూ! మీ కోసం! మనందరి కోసం!

(తులసి పడక గదిలోంచి పిచ్చిగానవ్వుకుంటూ వచ్చింది, తల విరబోసి వుంటుంది. చీరా, రవికా చిరిగి పోయాయి. ముఖం వాచిపోయింది. పిచ్చిచూపులు చూసి ఫకాలున నవ్వింది. భూషణ్ చూశాడు, "తులసీ!" అనుకుంటూ ఆమెదగ్గరకు వెళ్ళబోయాడు. ఆమె యింకా నవ్వుతూనే వుంది)

భూ : తులసీ! తులసీ! ఏవిఁటిది?

తుల : రాకు! నన్ను ముట్టుకోకు.

భూ : తులసీ!

తుల : దగ్గరకు రాకు. దగ్ధమైపోతావ్.

భూ : ఏవిఁటి? ఏవఁయింది తులసీ?

తుల : అగ్ని పర్వతం (ఏడ్చింది) ఆరిపోయింది. ఆర్పేశారు. భ్రష్టురాలినయాను. పోయాను.

భూ : ఆ! (పడక గదిలోకి పరుగెత్తబోయాడు )

తుల : ఎక్కడికి?

భూ : వాడి రక్తం తాగుతాను.

తుల : (నవ్వింది) నువ్వా! (మరింత నవ్వింది) ఎలకవి! వద్దు. పోట్లాడ లేవు. నీకు బలంలేదు. బలగంలేదు. పో. వెళ్ళిపో! పారిపో. దూరంగా పారిపో! ఈ మనుషులకి అందకండా దూరంగా పారిపో.... వినిపించుకోవేం? చావాలని వుందా?

భూ : అవును! అందర్నీ చంపేస్తాను.

తుల : (నవ్వింది) విప్లవకారుడవ్! చేతులు లేని సాహసికుడవ్. వద్దు. వింటే నవ్వుతారు వద్దు. పారిపో! (అతని చొక్కా పట్టుకుంది)

భూ : తులసీ! ప్రతీకారం తీర్చుకుంటాను. వదులు నన్నొదులు. (ఆమెను విడిపించుకుని పడక గదిలోకి పరుగెత్తాడు)

తుల : పోయాడు. చెయ్యిదాటిపోయాడు. మనుషులకు దారి చూపించే విప్లవమూర్తి పోయాడు. (లోపలపిస్తోలు పేలినశబ్దం) పోయాడు! (ఏడ్చింది) ప్రపంచానికి పీడా విరగడయింది. మీరే బ్రతకండి! మీరే నవ్వండి. (మరోసారి ప్రేలుడు, ఎడతెరిపి లేకుండా ప్రేలుడు వినిస్తుంది.) భగవంతుడా! భగవంతుడా భగవంతుడా! వువ్వు నిజంగా వున్నావా? ఎక్కడా? ఏమిటి నీ దారుణం? జీవితం గురించి కలలు కన్నామే! ప్రపంచంలోని మనుషుల నందర్నీ మనుషులుగా బ్రతికించుకోవాలని ప్రయత్నాలు చేశామే. అదే మేం చేసిన తప్పా? అదే మేం ఆశించకూడని ఆశయమా? నువ్వెక్కడున్నావ్? ఏమిటి చేస్తున్నావ్? ఏమిటి నీలీల? ఎందుకు నీ సృష్టిని నువ్వేయిలా ధ్వంసం చేసేస్తున్నావు? కలియుగాంతమా? ఇది నీ సరదాయా? ఏమిటి మాట్లాడవు? మాట్లాడవా? మాట్లాడవా? సరే, నీ సృష్టిని నువ్వే అంతం చేసేసుకో. సర్వ

నాశనం చేసేసుకో. మొహెంజొదారో చేసేసుకో. మొహెంజొదారో।

(నవ్వింది) మొహెంజొదారో (నవ్వుతూ పిచ్చిదాన్లా పోయింది)

(లోపలనించి ప్రేలుళ్ళు వినిపిస్తూ వుండగా "కోటీశ్వరయ్యగారూ" అనుకుంటూ డాక్టర్, లాయర్ వస్తారు. శబ్దాలు విని పారిపోతూ వుంటే వెనకనించి పరంధామయ్యవచ్చి Imaginary తలుపులు వేసేసి ద్వారానికి అడ్డంగా నిలబడ్డాడు)

లా : లే। అడ్డం తప్పుకో.

డా : మేం వెళ్ళిపోవాలి,

లా : మేం బ్రతకాలి.

డా : ఇక్కడ ఖూనీలు జరిగాయి.

[డాక్టర్, లాయర్, పరంధామయ్య మీద పడి "లే" అని లాగేసి తలుపులు తెరవబోతారు, అవి తెరుచుకోవు.]

పరం : ప్రపంచం తలుపుల్ని మూసేసుకుంది డాక్టర్। విశ్వం దర్వాజాలని బంధించేసింది. ఎక్కడికి పోగలరుమీరు?

డా : మేం జనంలోకి పోతాం.

లా : మేం ప్రజల్లో పడిపోతాం.

పరం : ఒక్క క్షణం ఆగండి. కోటీశ్వరయ్య వస్తాడు. మొహెంజొదారో సృష్టి కర్తకు ఆఖరి వీడ్కోలు చెప్పిపోదురు గాని.

డా : అవసరంలేదు. లే దారికడ్డంగా।

లా : ఆఖరి సారిగా చెప్తున్నా।

(డాక్టర్ లాయర్ అతనిమీద పడ్డారు. పరంధామయ్య Imaginary పిస్టల్ తీశాడు)

డా : పిస్టల్!

లా : చంపేస్తావా?

(పరంధామయ్య నవ్వాడు)

పరం : ఎంత పిరికివాళ్ళయ్యా మీరు!

కో : (వచ్చాడు.) సమయానికి మీరూవచ్చారు! (Imaginary పిస్టల్ అందరికీ గురిపెట్టాడు డాక్టర్ లాయర్ కోటీశ్వరయ్య కాళ్ళమీద పడిపోయారు!)

లా : కోటీశ్వరయ్యగారూ!

డా : ఆ వెధవ మమ్మల్ని కాల్చేస్తాడటండీ!

కో : వాడుకాదు కాల్చేది! నేను,

డా : (ఆశ్చర్యంగా) కోటీశ్వరయ్యగారూ!

కో : అవున్రా నేనే కాల్చేస్తాను. సర్వనాశనం చేసేస్తాను.

లా : మేం! మేం....మీ ప్రాణస్నేహితుల మండీ!

డా : మేం మీ మిత్రులం సార్!

కో : నా కెవరూ లేరు.

లా : అయ్యో! అయ్యో! ఎలక్షన్లలో ఇన్నిన్ని సహాయాలు చేశావే!

డా : ఎండనక వాననక—

లా : రాత్రనక పగలనక—

డా : నిద్రాహారాలుమాని—

లా : చెప్పు లరిగిపోయినా మీకే యిమ్మని యిన్నిన్ని ప్రచారాలు చేసి—

డా : మా అందరివోట్లూ మీకే వేశావేం!

కో : మీరు, నాకు వోట్లేశారా?

డా, లా; ఒట్టు. ఓట్లు మీకే వేశాం.

కో : మీరా నాకు వోట్లు వేసింది? కాదు—మీరుకారురా వాడు— ఆ పరంధామయ్య, పరంధామయ్య ఒక్కడే నాకు వేశాడు.

పరం : (పక పక నవ్వాడు) నేను వెయ్యలేదు.

డా : (ఛప్పున) అవునుసార్ అతనుకాదు వేసింది: నేను వేశాను:

లా : వాళ్ళిద్దరూ కాదు సార్. నేను వేశాను.

డా : అవును బాబుగారూ! నేనూ లాయరూ ఒకటే వేశాం. కాని పరంధామయ్య మాత్రం వెయ్యలేదు. మేం చూశాం.

పరం: మీరెవరూ చూడలేదు. చూడబోయింది నా అంతరాత్మ! నేనుచూడ నివ్వలేదు. కోటీశ్వరయ్యా నేను నీకు వోటివ్వలేదు. ఇవ్వలేను. ఇవ్వను. ఇవ్వబోను,నిజం చెప్తున్నాను: నీలాంటి నీచాత్ముడికీ, దుర్మార్గుడికీ, రాక్షసాధముడుకీ, క్షుద్రమానవుడికి, కర్కశ హృదయుడికీ, కఠిన జంతువుకి నా పవిత్రాతి పవిత్రమయిన "ఓటుని" అర్పించి సమాజాన్ని ఇంకా ఇంకా కలుషితం చెయ్యలేమ. నన్ను సర్వనాశనం చేశావ్: నన్ను నైతికంగా, మానసికంగా, సామాజికంగా చంపేశావ్. నన్నే కాదు కోటి కోట్ల ప్రాణుల్ని చంపేశావ్!

కో : నోర్ముయ్! ఇన్నాళ్లూ నేను పాముల్ని చేరదీశాను.

(కోటీశ్వరయ్య పిస్టల్ అందరికీ గురిపెట్టాడు. డాక్టరు,

లాయరు 'మమ్మల్ని చంపకండి కోటీశ్వరయ్యగారూ' మీ మిత్రులం మేం' అని కాళ్లు పట్టుకుంటారు. పరంధామయ్య వాళ్ళిద్దరి చొక్కాలూ పట్టుకొని బర బర యీడ్చుకొచ్చి తన పక్కన నిలబెట్టాడు)

పరం : కాల్చు, కాల్చు దుర్మార్గుడా!

(కోటీశ్వరయ్య పేల్చాడు, రెండు పేల్పులకి డాక్టరు లాయరు ఆర్తనాదాలుచేసి పడిపోయారు. పరంధామయ్య మీదికి కూడా పేల్చాడు, కాని ఆ దెబ్బ పరంధామయ్యకు తగల్లేదు. పరంధామయ్యనవ్వాడు. విరగబడినవ్వాడు. మళ్ళీ మళ్ళీ పేల్చాడు. పరందామయ్యకు చీమ కుట్టినట్టయినా లేదు)

పరం : నేను ఏనాడో చచ్చాను కోటీశ్వరయ్యా. నీ పిస్టల్‌నన్ను కాల్చలేదు నా చర్మం ఉక్కు కంటే గట్టిదై పోయింది. నీ గుళ్ళు నన్ను ఛేదించలేవు, కాని.... నేను పోతాను. నిన్నుచంపి మరీ పోతాను. నిన్ను నాశనంచేసి మరీ పోతాను. [పిస్టల్ తీసి ముందుకు వస్తాడు]

కో : ఆగు! అక్కడే ఆగు. (వెనక్కి అడుగులు వేస్తాడు)

పరం : ఆగను. నువ్వు చంపిన నా మానవత్వం ప్రతీకారం తీర్చుకుంటుంది.

కో : ఒద్దు, ఒద్దు పరంధామయ్యా—నన్ను చంపకు.

పరం : ఏం ?

కో : నేను చచ్చిపోలేను.

పరం : చావు అంత బాధగా వుంటుందా?

కో : నే నెప్పుడూ చావలేదు.

పరం : అందుకే నీకు మనిషి చావడమంటే ఏమిటో తెలీదు. నిన్ను ఒక్కసారే చంపను, చిత్రవధచేసి చంపుతాను. (Imaginary పిస్టల్ పేల్చాడు. కోటీశ్వరయ్య కడుపు పట్టుకుంటాడు) తీయ్ నీ తుపాకీ. పెట్టు అందులో నీ కరెన్సీ అంతట్నీ, నింపు నీ తుపాకీని నీ హోదాతో, నీ పలుకుబడి బులెట్లతో రక్షక భటుల్ని పిలు! నీ 'లా' నీ, నీ న్యాయస్థానాన్నీ, నీ న్యాయమూర్తుల్నీ నీకున్న డబ్బుతో పిలు. (మరోసారి, మరోసారి, మరోసారి పేల్చాడు.)

కో : పరంధామయ్యా! నన్ను చంపకు పరంధామయ్యా! నన్ను చంపకు.

[అంటూనే నేలకొరిగాడు. ఇంతకు ముందే పడకగదిలోనించి భూషణ్ వచ్చాడు. అంతా బాధతో వింటున్నాడు. అతని వళ్ళంతా తూట్లుపడి వున్నై! కోటీశ్వరయ్య నేల కొరగడంతో పరంధామయ్య కిప్పుడు వంట్లో బాధ పట్టుకుంది. కింద ఒరిగి పోయాడు. తూలుతూ వచ్చి భూషణ్ అతన్ని పట్టుకున్నాడు.]

భూ : పరంధామయ్యా! పరంధామయ్యా! నిన్ను గుర్తించలేక పోయాను పరంధామయ్యా!

పరం : (చిరునవ్వు) భూషణ్! నన్ను మన్నించగలవా?

భూ : మనం ఎప్పుడూ ఒకే జాతివాళ్ళం పరంధామయ్యా!

పరం : కాని అన్యాయం చేసేశాను. మీకూ, మీ ఉద్యమానికీ, ప్రపంచానికీ, మానవ లోకానికీ, మనుష్య సమాజానికీ, మానవత్వానికీ ...

భూ : తప్పు మార్గం పట్టినా, నీ ధ్యేయం కూడా స్వర్గ సామ్రాజ్యమే.

పరం : కాదు భూషణ్ ! ఆ సామ్రాజ్యంలో కూడా స్వార్థపరుణ్ణీ, నీచుణ్ణీ బదనికనూ అయేవాడిని. కాని భూషణ్ నా కొక్కటే సంతోషం. నీ చేతుల్లో పోతున్నానని. నన్ను క్షమించవూ.....క్ష.....మిం.... చవూ !

[పరంధామయ్య పడిపోయాడు. భూషణ్ బాధకి కిర్రోర్లాడి పోతూ వుంటాడు. దూరంనించి ఈ గేయం వినిపిస్తుంది.]

గేయం : మరుగు పడింకొక మహీధరం
స్మరణీయ విజయ ధరాధరం
పురాతన మనుజ పురోగమనమున
మరపురానిది మొహెంజొదారో ॥మరు॥

[గేయం వినిపిస్తూవుండగా భూషణం పడిపోయాడు. తర్వాత మెల్లగా శాస్త్రజ్ఞుడు స్టేజిమీదికి వచ్చాడు. ప్రేక్షకులకు అభివాదన చేస్తాడు.]

(తెర)

